| | | |
|---|---|---|
| శీర్షిక | : ధ్రువోపాఖ్యానము, | |
| ముద్రణ | : ప్రథమ ముద్రణ (అంతర్జాల | 2012 |
| | : ద్వితీయ (కాగితాల పుస్తకం) | 2023 |
| సంకలనం రచయిత | : భాగవత గణనాధ్యాయి | |
| ముద్రణాలయము | : pothi.com | |
| ప్రచురణ | : ఊలపల్లి ప్రచురణలు | |
| సంపర్క | : 995961369 | |

# ॥ధ్రువోపాఖ్యానం॥

భాగవత పురాణంలో పంచ ఉపాఖ్యానాలు ప్రముఖమైనవి. రుక్మిణీ కల్యాణము, గజేంద్రమోక్షణ, ప్రహ్లాదోపాఖ్యానము, వామన చరిత్ర, ధ్రువో పాఖ్యానము. ఇవి సుందరకాండ తెలియని వారు ఉండరు. ఇది, శ్రీపోతన తెలుగు భాగవతములోని ధ్రువోపాఖ్యాన మనే ఉపాఖ్యానము. కొన్ని కోట్లజన్మలలో ఎప్పుడో ఎవడో ఒక్క మనుష్యుడు మాత్రమే ఈశ్వరుని అనుగ్రహముపొందినవాడు మాత్రమే ద్వాదశినాడు ధ్రువోపాఖ్యానమును వింటున్నాడు. ద్వాదశినాడు ధ్రువోపాఖ్యానము వింటే ఎన్నో మంచి ఫలి తములు వస్తాయి. ఎన్నో గ్రహములు ఉపశాంతి పొందుతాయి. ఎంతో మేలు జరుగుతుంది. మనిషి జీవితంలో భాగవత ఉపాఖ్యానాలలో ధ్రువుని వృత్తాంతము ముఖ్యమైనది. ద్వాదశినాడు కానీ, పౌర్ణమి నాడు కానీ, అమావాస్య నాడు కానీ దినక్షయము నందు కానీ, అసురసంధ్యవేళ కానీ ధ్రువచరిత్ర వింటే చాలా మంచిది.

ధ్రువచరిత్ర ఒక ఆశ్చర్యకరమయిన సందర్భము. మిథున విధానంలో సృష్టి జరిపించడము కోసమని బ్రహ్మదేవుడుగారు తన శరీరంలోంచి శతరూప అనే స్త్రీ స్వరూపమును, స్వాయంభువ మనువు అనే పురుష స్వరూపమును సృష్టి చేశారు. వారిద్దరిని సృష్టి చేయమని బ్రహ్మగారు ఆదేశించారు. వారికి ఆకూతి, దేవహూతి, ప్రసూతి అనే ముగ్గురు కుమార్తెలు, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడనే ఇద్దరు కుమారులు కలిగారు.

ఉత్తానపాదుడికి మొదటి భార్య సునీతి, రెండవ భార్య సురుచి. ఆ ఇద్దరు భార్యలతో చాలా సంతోషముగా ఉత్తానపాదుడు జీవితమును గడుపుతున్నాడు. ఉత్తానపాదుడు అంటే కాళ్ళుపైకిలేపినవాడు, క్రియా శీలుడు. సునీతి ఎప్పుడూ నీతిచెపుతూ ఉంటుంది. తను మంచి నీతి మంతురాలు. సునీతికి ఒక కుమారుడు ధ్రువుడు. సురుచి ఎప్పుడూ మధురంగ ఆప్యాయంగ మాట్లాడుతూ మెలగుతూ ఉంటుంది. సురుచికి ఒక కుమారుడు ఉత్తముడు. ఉత్తానపాదుడికి సురుచియందున్న ప్రేమ సునీతి యందు లేదు. సునీతియందు లోపల గౌరవము ఉన్నా సురుచికి లొంగి పోయిన వాడవడం చేత సునీతిని గౌరవించడంలేడు. ఒకనాడు ఒక ఆశ్చర్యకర సంఘటన జరిగింది. అంతః పురంలో ఉత్తానపాదుడు కూర్చుని తన తొడమీద ఉత్తముని కూర్చుండ బెట్టుకుని ఉన్నాడు. పక్కన సురుచి ఉన్నది. సునీతికొడుకు ధ్రువుడు తండ్రితొడమీద కూర్చోవాలను కోరికతో, పరుగు పరుగున వచ్చాడు. తండ్రి ధ్రువుని తనతొడమీద ఎక్కించుకోలేదు. ఆవిడొక గమ్మత్తయిన మాట అంది. "నీవు నిజంగా తండ్రితొడమీదకూర్చుం దామనుకుంటే నా కడుపున పుట్ట వలసింది. పోనీ శ్రీమహావిష్ణువు పాదార విందములను కొలువు, ఆయన అనుగ్రహిస్తాడు" అని వెటకారంగా అంది.

నిజమునకు శ్రీమన్నారాయణుని అనుగ్రహం ఉన్నది కాబట్టి ధ్రువుడు సునీతి యందు పుట్టాడు. ధ్రువుడు ఏడుస్తూ వెళ్ళిపోయాడు. అమ్మ వాడిని ఎందుకురా ఏడుస్తున్నావు" అని అడిగింది. సునీతి జరిగిన విషయం అంతః పురకాంతలద్వారా తెలుసుకున్నది. ఆవిడ కొడుకును చూసి "నాయనా! మీ నాన్నతొడ ఎక్కనివ్వలేదని ఏడుస్తున్నావు కదా! నువ్వు గత జన్మ లలో చేసుకున్న పాపమే ఇవాళ నిన్ను ఏడిచేటట్లు చేసింది. నీ పినతల్లి కాని, నేను కాని, నీ తండ్రి కాని నీ బాధకు కారణము కాదు. నువ్వు చేసు కున్న పాపకర్మయే నీ దుఃఖమునకు కారణం. నిజంగా నీ తండ్రి తొడ ఎక్కి కూర్చోవాలని కోరితే, అరణ్యములకు వెళ్ళి శ్రీమన్నారాయణుని గూర్చి తపస్సు చెయ్యి. సర్వమూ సమకూరతాయి." అని చెప్పింది.

పిల్లవాడు, ఐదేళ్ళ వాడు, ధ్రువుడు వెంటనే బయలుదేరాడు. లోకకళ్యా ణార్థము జ్ఞానమందించే నారదమహర్షి. ధ్రవుడు, ప్రహ్లాదుడు, వేదవ్యాసుడు మొదలగు వారందరికీ మార్గదర్శనము చేసనది వీరే. అట్టి నారదుడు వచ్చి "నాయనా! నీవు ఎక్కడికి వెడు తున్నావు?" అని అడిగాడు. ధ్రువుడు "నేను అడవికి నారాయణుని గూర్చి తపస్సు చేయడానికి వెళ్తున్నాను" అన్నాడు. నారదుడు నవ్వి "నారాయణునిగురించి తపస్సు నీకు దేనికి? అని అడిగి "ఈ బుద్ధి నీకు నిలబడుగాక!" అని పరమ పావన మయిన తన చేతిని ధ్రువునిశిరస్సునందు ఉంచాడు. పిమ్మట నారదుడు ధ్రువుని "నారా యణుడు కనపడితే ఏమిచేస్తావు? అని అడిగాడు. ధ్రువుడు "అన్నిటి కన్నా ఉన్నతమైన పదవి కోరతాను" అన్నాడు. నారదుడు శ్రీమన్నారాయ ణ దర్శనము బహుకష్టసాధ్యము. ఐనా, నీకు ఒకమంత్రంచెపుతాను. దానిని మననముచెయ్యి. నీకు మనస్సునందలి ఖేదము పోతుంది. నీ కన్నా గౌర వింపదగి నటువంటి పెద్దలు కనపడినట్లయితే వాళ్ళని గౌరవించు నమస్క రించు ఆదరించు. నీతో సమానమయిన వారితో మిత్రత్వము చెయ్యి. తక్కువ వాళ్ళు కనిపిస్తే కారుణ్యంతో ప్రవర్తించు. ఈ మూడూ గుర్తు పెట్టు కుంటే నువ్వు చక్కగా వృద్ధిలోనికి వస్తావు. ఇక ఇంటికి వెళ్ళు" అన్నాడు.

ధ్రువుడన్నాడు "మీరు చెప్పినమాటలు వినడానికి చాలాసొంపుగా ఉన్నాయి. నేను పుట్టుక చేత క్షత్రియుడిని కదా! నాకు కొంచెం పౌరుషము ఎక్కువ. మాపిన్ని నన్ను అంతమాట అన్నది. నా మనస్సు ఎంతో గాయ పడింది. శ్రీమన్నారాయణ సందర్శనమనే ఔషధమే మా పిన్ని మాటలనే ఈ నా పుండును మాన్పగలదు. కనుక, నేను తపస్సుచేస్తా" నన్నాడు. నార దుల వారు ఆ పట్టుదలను గుర్తించి "నాయనా! నీకొక వ్రతము చెప్తాను అలా చెయ్యి. యమున ఒడ్డున ఉన్న మధువనము అను వనమునకు వెళ్ళు. అక్కడ యమునానదిలో స్నానము చేసి శుచియై ఆచమనము చేసి కూర్చో. నీ మనస్సును నిగ్రహించు. పువ్వులు, ఆకులు, తులసి తెచ్చుకో.

స్వామివారి మూర్తిని నీటిలోకానీ, పవిత్రప్రదేశములోకానీ పెట్టి వీటితో పూజచేయవలెను. మితముగా ఆహారముతీసుకో. ఎవ్వరితోనూ మాట్లా డకు. ఈశ్వరుని యందే మనస్సు పెట్టు. నీకు నారాయణుడు కనపడతాడు. నీకు నేను ద్వాదశాక్షరీ మంత్రోపదేశము చేస్తున్నాను. దీనిని ఏడు రోజులు నిష్టతో చేసేసరికి నీకు దేవతలు కనపడతారు" అని చెప్పాడు.

నారదుని మాటలు విన్న ధ్రువుడు సరే నని, గబగబా అరణ్యమునకు వెళ్ళాడు. భగవంతుని ఆరాధన విడివక చేసేవాడు. అయిదవ నెల వచ్చే సరికి ఈ పిల్లవాడు నిష్ఠతో కుడికాలు బొటనవేలు మీద నిలబడి తపస్సు చేస్తుంటే, భూమండలం అంతా అటు ఇటూ ఒరగడం ప్రారంభమయింది. దేవతలకు ఊపిరి బిగపట్టింది. అందరూ విష్ణుమూర్తి వద్దకు వెళ్ళి ఆ పిల్లవాని తపస్సు ఆపించమని కోరారు.

ఐదేండ్ల పిల్లవాడు ధ్రువుడి దగ్గరికి లక్ష్మీ సహితుడై, గరుడవాహనారూఢు డై ప్రత్యక్షమయ్యాడు. ధ్రువుడు కళ్ళువిప్పి చూశాడు. ఎవ్వరికీ దర్శనము ఇవ్వని స్వామి, మాంస నేత్రములకు గోచరము కాని స్వామి, ధ్రువుడికి దర్శన మిచ్చాడు. ఈపిల్ల వానికి నారాయణ అని పిలవడముకానీ, స్తోత్రాలు చేయడము కానీ రాదు. వాని కోరిక ఏమిటో వానికే తెలియదు. స్వామిని పైనుంచి క్రిందికి క్రిందనుంచి పైకి చూస్తూ అలాగే ఉండిపోయాడు. స్వామి నవ్వి తన శంఖమును ధ్రువుని శిరస్సు తాకించాడు. అంతే! ధ్రువుడు పొంగి పోయి అపురూపమైన స్తోత్రము చేసాడు. కాని ఏమి కోరుట లేదు. స్వామి "పెద్ద పదవి కావాలని బయలుదేరావు. కానీ ఆ పెద్ద పదవి ఎవరికీ దక్కదు. ఆపదవిని నీకిస్తున్నాను. ఆ పదవి ఏదైతే కదలకుండా ఉంటుందో, ధర్మము, అగ్ని, కశ్యపుడు, సప్తర్షులు, కాలము, నక్షత్ర మండలము, ఋతువులు, సూర్య, చంద్రాదిగ్రహములు సమస్తము దేనిని ఆధారముగా చేసుకుని రంగు లరాట్నం తిరిగినట్లు తిరుగుతాయో అటువంటి ధ్రువమండలము అను పదవి ఇస్తున్నాను. నీవు ధ్రువమండలమై వినువీధిన వెలుగుతుంటే నిన్ను ఆధారం చేసు కుని సమస్త జ్యోతిశ్చక్రము తిరుగుతూ ఉంటుంది. ఆ పదవిని నీకనుగ్రహిస్తున్నా. ఇప్పుడు నీవు ఇంటికివెళ్ళు. భవిష్యత్తుకాలమందు నీవు ఈ పదవి పొందుతావు" అని వరము అనుగ్రహించాడు. ధ్రువుడు ఇంతటి భాగ్యము కార్తీక శుద్ధ ద్వాదశినాడు పొందాడు. అందుకే ద్వాదశినాడు ధ్రువచరిత్ర వింటే ఎంతో మంచిది.

ఈలోగా, నారదుడు ఉత్తానపాదుని దగ్గరకు వెళ్ళాడు. ఉత్తానపాదుడు ఎదురు వచ్చి స్వాగతం పలికి అర్ఘ్యం ఇచ్చి లోపలి తీసుకువెళ్ళి కూర్చోబెట్టాడు. ఉత్తాన పాదుడు కొడుకు ధ్రువునికి చేసిన అవమానము తలచుకుని బాధపడుతున్నాడు. నారదుడు "నీ కుమారుని గురించి నీవు బాధపడుతు న్నావు. కానీ ఇవాళ నీ కొడుకు ఏ స్థితినిపొందాడోతెలుసా!

ఏమహాపురుషుని కేవలము క్రీగంటిచూపులచేత సమస్త బ్రహ్మాండ ములు రక్షింప బడుతున్నాయో, దేవతలందరూ రక్షింపబడుతున్నారో, సృష్టి, స్థితి, లయములు జరుగుతున్నాయో, ఎవరు హేలగా ఈ బ్రహ్మాం డములను సృష్టి చేసి కాపాడుతు న్నాడో అటువంటి వాని అనుగ్రహము పొంది నీ కొడుకు వరములను పొందాడు" అని చెప్పాడు. ఈ మాటలు విని ఉత్తానపాదుడు పొంగిపోయాడు.

పిమ్మట ధ్రువుడు రాజ్యములోనికి వస్తున్నాడని తెలిసి, తండ్రి పెద్ద ఉత్సవము చేశాడు. బంధుమిత్ర పరివారంతో ఉత్సాహముగా ఎదురు వెళ్ళాడు. కొడుకును చూడగానే గట్టిగా కౌగలించుకున్నాడు. ఉత్తాన పాదుడు, రాజ్యములోని ప్రజలు కోరిక మేరకు, ధ్రువుడికి పట్టాభిషేకము చేశాడు

కాలాంతరంలో ఒక చిత్రవిచిత్రమయిన విమానం ఒకటి ధ్రువుడు ఉన్న స్థానానికి వచ్చింది. నీలమేఘము వంటి శరీరము కలిగి శంఖ చక్ర గద పద్మములను పట్టుకుని శ్రీమన్నారాయణుడు స్వరూపములతో ఇద్దరు పురుషులు దిగి వచ్చారు. ధ్రువుడు వాళ్ళను చూసి ఆశ్చర్యపోతూ లేచి వాళ్లకి నమస్కరించాడు. వాళ్ళు "మరచి పోయావా! సమయము ఆసన్న మయినది. నిన్ను మేము ధ్రువమండలమునకు తీసుకువెళ్ళాలి. స్వామి నీకోసము ఈ విమానము పంపారు. మేము విష్ణుపార్షదు లము వచ్చి విమానము ఎక్కుము" అని అన్నారు.

ధ్రువుడు దివ్య శరీర ధారియై విమానము ఎక్కాడు. అది లోకములను దాటి వెళ్ళిపోతోంది. ఆయన తల్లి గురించి తలచుకున్నాడు. ఈ విషయ మును పార్షదులు గ్రహించి, "నిన్నీ స్థితికి తీసుకువచ్చింది కాబట్టే శ్రీమహా విష్ణువు నీకన్నా ముందు ఆవిడ విమానం నడుపమని చెప్పారు. కిటికీ లోంచి బయటకు చూడు" అన్నారు. ధ్రువుడు ముందు విమానంలో దివ్య మైన తేజోవిరాజితయై సునీతి శ్రీమన్నారాయణుని లోకానికి వెళ్ళిపోతుం డగా చూసి తృప్తి చెదాడు. ధ్రువుడు ధ్రువ మండలమునకు చేరుకొన్నాడు.

ఇంతటి అద్భుతమయిన ఈ ధ్రువోపాఖ్యానము ఎవరైతే పరమ భక్తితో వింటారో వారందరికీ ఆక్షణములోనే పాపనాశనము జరిగి శ్రీమన్నారాయ ణుని అనుగ్రహము కటాక్షింపబడుతుంది. గ్రహబాధలు ఆగిపోయి శుభ ములు పొందుతారు, కీర్తియును లభిస్తుంది. కార్తీక శుద్ధ ద్వాదశి తిథినాడు ధృవోపాఖ్యానము చదవడము లేదా వినడము ఎంతో అదృష్టము.... అదియును మన బమ్మెఱ పోతనామాత్య ప్రణీత మైనదైతే బహుళ ప్రయోజన కరము. . . .

ఇట్టి అద్భుత ధ్రువోపాఖ్యానము భావార్థములు సహితంగా అందిస్తున్నాము. ఆస్వాదించండి. మాకు మీ ఆదరాభిమానాలు, శుభాశీస్సులు అందించండి.

~ భాగవత గణనాధ్యాయి.

ఓం నమో భగవతే వాసుదేవాయ

# ధ్రువోపాఖ్యానము

## ప్రార్థన



4-1-క. ★

**శ్రీ విలసితధరణీతన**
**యావదన సరోజ వాసరాధిప! సిత రా**
**జీవదళనయన! నిఖిల ధ**
**రావర నుత సుగుణధామ! రాఘవరామా!**

టీక:- శ్రీవిలసితధరణీతనయావదనసరోజవాసరాధిప = శ్రీరామ {శ్రీవిలసిత ధరణీ తనయా వదనసరోజ వాసరాధిప - శ్రీ (లక్ష్మీదేవివలె, శుభకరమైన) విలసిత (ప్రకాశము గల) ధరణీ (భూదేవి యొక్క) తనయా (పుత్రిక, సీతాదేవి) వదన (మోము అనెడి) సరోజ (పద్మమునకు) వాసరాధిప (వాసరములకు (పగళ్ళ కు) అధిపతి, సూర్యుడ), శ్రీరామ}; సితరాజీవదళనయన = శ్రీరామ {సిత రాజీవ దళ నయన - సిత (తెల్లని) రాజీవ (తామరపువ్వు) దళ (రేకుల) వంటి నయన (కన్నులు గల వాడు), శ్రీరామ}; నిఖిల ధరావర నుత సుగుణ ధామ = శ్రీరామ {నిఖిల ధరావర నుత సుగుణధామ - నిఖిల (సమస్తమైన) ధరావర (రాజుల) చేత నుత (స్తోత్రము చేయబడిన) గుణములకు ధామ (నిలయ మైనవాడ), శ్రీరామ}; రాఘవరామా = శ్రీరామ {రాఘవరామా - రాఘవ (రఘు వంశమునకు చెందిన) రామ, శ్రీరామ}.

భావము:- శ్రీమహాలక్ష్మీతేజోరూపి, ఓర్పుకు మారుపేరైన భూదేవి పుత్రిక అయిన సీతదేవి మోము అనే పద్మాన్ని ప్రకాశింపజేసే దినకరుని వంటి వాడు; తెల్ల తామర పూరేకుల వంటి కన్నులు గలవాడు; సమస్తమైన రాజులు అందరిచేత స్తుతింపబడే సుగుణాలతో అలరారేవాడు; అయినట్టి ఓ రఘువంశపు శ్రీరామ! నీకు వందనములు.

## సురుచి అసహ్యవచనములు

4-216-క.

"విను నిఖిలభువన పరిపా
లనమునకై చంద్రధరకళా కలితుండై
వనజజునకు స్వాయంభువ
మను వపు డుదయించెఁ గీర్తిమంతుం డగుచున్.

టీక:- విను = వినుము; నిఖిల = సమస్తమైన; భువన = లోకముల; పరిపాలనమున్ = పరిపాలనము; కై = కోసము; చంద్రధర = శివుని {చంద్రధరుడు - చంద్రుని ధరించినవాడు, శివుడు}; కళా = కళతో; కలితుండు = కూడినవాడు; వనజుజున్ = బ్రహ్మదేవుని {వనజజుడు - వనజము (నీట పుట్టినది, పద్మము)న పుట్టినవాడు, బ్రహ్మదేవుడు}; స్వాయంభువ = స్వాయంభువ అనెడి {స్వాయంభువుడు - స్వయంభువుల (పుట్టినవారి) పుత్రుడు}; మనువు = మనువు; అపుడు = అప్పుడు; ఉదయించెన్ = జనియించెను; కీర్తిమంతుడు = కీర్తి కలవాడు; అగుచున్ = అవుతూ.

భావము:- “విదురా! విను. స్వాయంభువ మనువు అనే కీర్తిమంతుడు సకల లోకాలను పాలించడానికి ఈశ్వరుని అంశతో బ్రహ్మదేవునికి జన్మించాడు.

4-217-తే.

రూఢి నమ్మనునకు శతరూపవలన
భూనుతు లగు ప్రియవ్రతోత్తానపాదు
లనఁగ నిద్దఱు పుత్రులై రందులోనఁ
భవ్య చారిత్రుఁ డుత్తానపాదునకును.

టీక:- రూఢిన్ = ప్రసిద్ధముగ; ఆ = ఆ; మనువు = మనువున; కున్ = కు; శతరూప = శతరూప; వలన = అందు; భూ = భూమి యందు; నుతులు = స్తుతింపబడినవారు; అగు = అయిన; ప్రియవ్రత = ప్రియవ్రతుడు {ప్రియ వ్రతుడు - ప్రియమే వ్రతముగా కలవాడు}; ఉత్తానపాదులు = ఉత్తానపాదుడు {ఉత్తానపాదుడు - ఎత్తినపాదము కలవాడు, సిద్ధముగ ఉన్నవాడు}; అనగన్ = అనగ; ఇద్దఱు = ఇద్దరు; పుత్రులు = కొడుకులు; ఐరి = పుట్టిరి; అందులోన = వారిలో; భవ్య = యోగ్యమైన; చారిత్రుడు = ప్రవర్తన కలవాడు; ఉత్తాన పాదున్ = ఉత్తానపాదున; కును = కు.

భావము:- ఆ స్వాయంభువమనువుకు శతరూపనే భార్యవల్ల ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కొడుకులు కలిగారు. వారిలో ఉత్తానపాదునికి...

4-218-క.

వినుము సునీతియు సురుచియు
నను భార్యలు గలరు; వారి యందును ధ్రువునిం
గనిన సునీతియు నప్రియ
యును, సురుచియుఁ బ్రియయు నగుచు నున్నట్టి యెడన్.

టీక:- వినుము = వినుము; సునీతియు = సునీతి {సునీతి - సు (మంచి) నీతి కలామె}; సురుచియు = సురుచి {సురుచి - సు (మంచి) కాంతి కలామె}; అను = అనెడి; భార్యలు = భార్యలు; కలరు = ఉన్నారు; వారి = వారి; అందును = లో; ధ్రువునిన్ = ధ్రువుని; కనిన = కన్నట్టి; సునీతియు = సునీతి; అప్రియయును = ప్రియము కానిది; సురుచియు = సురుచి; ప్రియయున్ = ప్రియమైనది; అగుచున్ = అగుచు; ఉన్నట్టి = ఉన్నటువంటి; ఎడన్ = సమయములో.

భావము:- (ఉత్తానపాదునికి) సునీతి, సురుచి అని ఇద్దరు భార్య లున్నారు. వారిలో ధ్రువుడు అనే కొడుకును కన్న సునీతిపై రాజుకు ప్రీతి లేదు. సురుచి అంటే రాజుకు మిక్కిలి మక్కువ. ఇలా ఉండగా...

4-219-సీ.

ఒకనాఁడు సుఖలీల నుత్తానపాదుండు-
    నెఱిఁ బ్రియురాలైన సురుచి గన్న
కొడుకు నుత్తముఁ దన తొడలపై నిడుకొని-
    యుపలాలనము చేయుచున్న వేళ
నర్థిఁ దదారోహణాపేక్షితుం డైన-
    ధ్రువునిఁ గనుంగొని తివక నాద
రింపకుండుటకు గర్వించి యా సురుచియు-
    సవతి బిడ్డండైన ధ్రువునిఁ జూచి

4-219.1-తే.

"తండ్రి తొడ నెక్కు వేడుక దగిలెనేనిఁ
బూని నా గర్భమున నాఁడె పుట్ట కన్య
గర్భమునఁ బుట్టి కోరినఁ గలదె నేఁడు
జనకు తొడ నెక్కు భాగ్యంబు సవతి కొడుక!

టీక:- ఒకనాడు = ఒకనాడు; సుఖ = సుఖమైన; లీలన్ = విధముగ; ఉత్తానపాదుండు = ఉత్తానపాదుడు; నెఱి = బాగుగ, వక్రముగ; ప్రియురాలు = ప్రియురాలు; ఐన = అయిన; సురుచి = సురుచి; కన్న = కన్నట్టి; కొడుకున్ = పుత్రుని; ఉత్తమున్ = ఉత్తముని {ఉత్తముడు – మంచివాడు}; తొడల = తొడల; పైన్ = మీద; ఇడుకొని = ఉంచుకొని; ఉపలాలనము = బుజ్జిగిస్తుం డగ; చేయుచున్న = చేస్తున్న; వేళ = సమయములో; అర్థిన్ = కోరి; తత్ = ఆ; ఆరోహణ = ఎక్కుట; ఆపేక్షితుడు = కోరినవాడు; ధ్రువునిన్ = ధ్రువుని; కనుంగొని = చూసి; తివక = దగ్గరకు తీయక; ఆదరింపకుండుట = ఆదరించకుం డుట; కున్ = కు; గర్వించి = గర్వము చెంది; ఆ = ఆ; సురుచియు = సురుచి; సవతి = సవతియొక్క; బిడ్డడు = కొడుకు; ఐన = అయిన; ధ్రువునిన్ = ధ్రువుని; చూచి = చూసి.

తండ్రి = తండ్రి యొక్క; తొడన్ = తొడను; ఎక్కు = ఎక్కెడి; వేడుక = ఆపేక్ష; తగిలినేని = కలిగినట్లయితే; పూని = యత్నించి; నా = నా యొక్క; గర్భమున = గర్భ ములో; నాడె = ఆవేళనే; పుట్టక = పుట్టకుండ; అన్య = ఇతరమైన; గర్భమున = గర్భములో; పుట్టి = జన్మించి; కోరినన్ = కోరితే; కలదె = కలుగుతుందా; నేడు = ఈవేళ; జనకున్ = తండ్రి యొక్క; తొడను = తొడను; ఎక్కు = ఎక్కెడి; భాగ్యంబు = అదృష్టము; సవతి = సపత్నీ; కొడుక = సుతుడ.

భావము:- ఒకనాడు ఉత్తానపాదుడు సురుచి కొడుకైన ఉత్తముణ్ణి చక్కగా (నెఱి అంటే బాగా అని, వక్రత అని కూడ అర్థం ఉంది కనుక అంతర్లీనంగా ఇద్దరు కొడుకులలో ఒకని యందు పక్షపాతం చూపడం అను వక్రత స్ఫురిస్తున్నది) తన తొడలపై కూర్చుండ బెట్టుకొని ముద్దు చేస్తుండగా ధ్రువుడు తానుకూడ తన తండ్రి తొడలపైకి ఎక్కటానికి ఉబ లాటపడ్డాడు. కాని ఉత్తానపాదుడు ధ్రువునిదగ్గరకు తీసుకోలేదు. ఆప్యాయంగా ఆదరించ లేదు. అందుకు సురుచి గర్వించి, సవతి కొడుకైన ధ్రువుణ్ణి చూచి ఇలా అన్నది. "నా కడుపున పుట్టినవాడే తండ్రితొడ ఎక్కటానికి అర్హుడు. మరొక స్త్రీ గర్భాన పుట్టిన నీకు తండ్రి తొడ ఎక్కే అదృష్టం ఎలా కలుగుతుంది? అంత తండ్రితొడెక్కాలనే ఉబలాటము రగిలితే మరి నా కడుపున పుట్టాల్సింది కాని పుట్టలేదు కదా.

4-220-క.

**అదిగాన నీ వధోక్షజు**
**పదపద్మము లాశ్రయింపు; పాయక హరి నా**
**యుదరమునఁ బుట్టఁ జేయును,**
**వదలక యట్లయిన ముదము వఱలెడి నీకున్."**

టీక:- అదిగాన = అందుచేత; నీవు = నీవు; అధోక్షజు = విష్ణుని; పద = పాదములు అనెడి; పద్మములు = పద్మములు; ఆశ్రయింపు = అశ్రయించుము; పాయక = విడువకుండ; హరి = విష్ణువు; నా = నా యొక్క; ఉదరమున = కడుపులో; పుట్టన్ = పుట్టునట్లు; చేయును

= చేయును; వదలక = తప్పక; అట్లు = ఆ విధముగ; అయిన = అయినచో; ముదము = సంతోషము; వఱలెడి = వర్థిల్లును; నీకున్ = నీకు.

భావము:- కనుక ధ్రువకుమారా! నీవు విష్ణుదేవుని పాదపద్మాలను ఆశ్రయించు. ఆయన నిన్ను నాకడుపున పుట్టేటట్లు అనుగ్రహిస్తాడు. అప్పుడు నీకోరిక నెరవేరుతుంది."

4-221-క.

**అని యీ రీతి నసహ్యవ**

**చనములు పినతల్లి యపుడు జనకుఁడు వినగాఁ**

**దను నాడిన దుర్భాషా**

**ఘనశరములు మనము నాఁటి కాఱియపెట్టన్.**

టీక:- అని = అని; ఈ = ఈ; రీతిన్ = విధముగ; అసహ్య = సహింపరాని; వచనములు = మాటలు; పినతల్లి = పినతల్లి; అపుడు = అప్పుడు; జనకుడు = తండ్రి; వినగాన్ = వింటుండగ; తనున్ = తనను; ఆడిన = అనిన; దుర్భాషా = తిట్లు అనెడి; ఘన = పెద్ద; శరములన్ = బాణములు; మనమున్ = మనసున; నాటి = తగిలి; కాఱియపెట్టన్ = బాధపెట్టగా.

భావము:- అని ఈ విధంగా తండ్రి వింటూ ఉండగా పినతల్లి సురుచి పలికిన సహింప రాని వాక్యాలను ధ్రువుడు తట్టుకోలేకపోయాడు. ఆమె నిందావాక్యాలు బాణాలవలె అతని మనస్సులో నాటుకొని పీడించగా...

4-222-క.

**తను నట్లుపేక్ష చేసిన**

**జనకునికడఁ బాసి దుఃఖ జలనిధిలోనన్**

**మునుఁగుచును దండతాడిత**

**ఘనభుజగముఁబోలె రోషకలితుం డగుచున్,**

టీక:- తనున్ = తనను; అట్లు = ఆవిధముగ; ఉపేక్ష = నిర్లక్ష్యము; చేసిన = చేసినట్టి; జనకుని = తండ్రి; కడ = దగ్గరనుండి; పాసి = దూరమై; దుఃఖ = దుఃఖము అనెడి; జలనిధి = సముద్రము {జలనిధి - జలమునకు నిధివంటిది, సముద్రము}; లోనన్ = లో; మునుగుచున్ = మునిగిపోతూ; దండ = కఱ్ఱచేత; తాడిత = కొట్టబడిన; ఘన = పెద్ద; భుజగము = సర్పము; పోలెన్ = వలె; రోష = కోపముతో; కలితుండు = కూడినవాడు; అగుచున్ = అవుతూ.

భావము:- ఆ విధంగా తనను నిర్లక్ష్యం చేసిన తండ్రి దగ్గరనుండి దెబ్బ తిన్న పాములాగా రోషంతో, పట్టరాని దుఃఖంతో ధ్రువుడు తల్లి వద్దకు వచ్చాడు.

4-223-క.

ఘన రోదనంబు చేయుచుఁ
గనుఁగవలను శోకబాష్ప కణములు దొరఁగన్
జనని కడ కేగుటయు నిజ
తనయునిఁ గని యా సునీతి దద్దయుఁ బ్రేమన్.

టీక:- ఘన = అధికమైన; రోదనంబుచేయుచూ = ఏడుస్తూ; కనుగవలను = కళ్ళ జంట వెంట; శోక = దుఃఖపు; బాష్ప = కన్నీటి; కణములు = బొట్లు; తొరగన్ = స్రవిస్తుండగా; జనని = తల్లి; కడకున్ = వద్దకు; ఏగుటయు = వెళ్లెను; నిజ = తన; తనయుని = పుత్రుని; కని = చూసి; ఈ = ఈ; సునీతియు = సునీతి; దద్దయున్ = మిక్కిలి; ప్రేమన్ = ప్రేమతో.

భావము:- బిగ్గరగా ఏడుస్తూ, కన్నులనుండి దుఃఖబాష్పాలు రాలుతూ ఉండగా కన్నతల్లిని సమీపించాడు. సునీతి కన్నకొడుకును చూచి మిక్కిలి ప్రేమతో....

4-224-వ.

తొడలపై నిడుకొని.

టీక:- తొడల = తొడల; పైన్ = మీద; ఇడుకొని = ఉంచుకొని.

భావము:- తన తొడలపై కూర్చుండబెట్టుకొని....

4-225-క.

కర మనురక్తిని మోము ని
విరి తద్వృత్తాంత మెల్ల వెలఁదులు నంతః
పురవాసులుఁ జెప్పిన విని
పఱపుగ నిట్టూర్పు లెసఁగ బా ష్పాకుల యై.

టీక:- కరము = మిక్కిలి; అనురక్తిన్ = ప్రేమతో; మోము = ముఖము; నివిరి = నివిరి; తత్ = ఆ; వృత్తాంతము = సమాచారము; వెలదులు = స్త్రీలు; అంతఃపుర = అంతఃపురమున; వాసులు = నివసించువారు; చెప్పినన్ = చెప్పగ; విని = విని; పఱపుగ = పొడవైన, విరివిగా; నిట్టూర్పులు = విట్టూర్పులు; ఎసగన్ = అతిశయించగ; బాష్పా = కన్నీటి చే; ఆకుల = వ్యాకులము చెందినది; ఐ = అయ్యి.

భావము:- ఎంతో గారాబంతో కొడుకు ముఖాన్ని నిమిరి, జరిగిన వృత్తాంతం అంతఃపుర కాంతలు చెప్పగా విని, నిట్టూర్పులు విడుస్తూ, కన్నీరు కార్చుతూ...

4-226-తే.

సవతి యాడిన మాటలు సారెఁ దలఁచి
కొనుచుఁ బేర్చిన దుఃఖాగ్నిఁ గుందుచుండెఁ
దావపావక శిఖలచేఁ దగిలి కాంతి
వితతిఁ గందిన మాధవీలతికబోలె.

టీక:- సవతి = సపత్ని; ఆడిన = పలికిన; మాటలు = పలుకులు; సారెన్ = మరల మరల; తలచికొనుచున్ = తలచుకొంటూ; పేర్చిన = అతిశయిం చిన; దుఃఖ = దుఃఖము అనెడి; అగ్నిన్ = నిప్పులో; కుందుచుండె = శోకించు చుండె; దావ = అడవి, కార్చిచ్చు; పావక = అగ్ని; శిఖల = మంటల; చేన్ = చేత; తగిలి = చిక్కుకొని; కాంతి = కాంతి; వితతిని = పుంజములను; కందిన = కందిపోయిన; మాధవీ = మాధవి అనెడి; లతిక = పూలతీగ; పోలెన్ = వలె.

భావము:- సవతి అయిన సురుచి తన కొడుకును అన్న మాటలను మాటిమాటికీ తలచుకొంటూ కార్చిచ్చు మంటల వేడికి కంది కళతప్పిన మాధవీ లతలాగా శోకాగ్నితో కుమిలిపోయింది.

4-227-వ.

అంత నా సునీతి బాలునిం జూచి "తండ్రీ! దుఃఖింపకు"మని యిట్లనియె.

టీక:- అంతన్ = అంతట; ఆ = ఆ; సనీతి = సునీతి; బాలునిన్ = పిల్లవానిని; చూచి = చూసి; తండ్రీ = తండ్రీ; దుఃఖింపకుము = దుఃఖించకుము; అని = అని; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- అప్పుడు ఆ సునీతి తనకొడుకును చూచి “తండ్రీ! దుఃఖించకు” అంటూ ఇలా అన్నది.

4-228-క.

"అనఘా! యీ దుఃఖమునకుఁ
బనిలే దన్యులకు సొలయ బలవంతంబై
తన పూర్వ జన్మ దుష్కృత
ఘనకర్మము వెంటనంటఁగా నెవ్వలనన్.

టీక:- అనఘా = పుణ్యుడ; ఈ = ఈ; దుఃఖమున్ = దుఃఖమున; కున్ = కు; పనిలేదు = అవసరంలేదు; అన్యుల = ఇతరుల; కున్ = కి; సొలయన్ = నిందించవలసిన;

బలవంతంబు = శక్తికలది; ఐ = అయ్యి; తన = తన యొక్క; పూర్వ = కిందటి; జన్మ = జన్మమునకు చెందిన; దుష్కృత = పాపపు; ఘన = గొప్ప; కర్మము = కర్మము; వెంటనంటన్ = కూడా రాగ; ఎవ్వలనన్ = ఏలాగైనాసరే.

భావము:- "నాయనా! మన దుఃఖానికి ఇతరులను అనవలసిన పని లేదు. పూర్వజన్మంలో చేసిన పాపం మానవులను వెంబడించి వస్తుంది.

4-229-వ.

కావున.

టీక:- కావున = అందుచేత.

భావము:- కనుక...

4-230-క.

పెనిమిటి చేతను బెండ్లా
మని కాదు నికృష్టదాసి యనియును బిలువం
గను జాలని దుర్భగురా
లనఁగల నా కుక్షి నుదయ మందిన కతనన్.

టీక:- పెనిమిటి = భర్త; చేతను = చే; పెండ్లాము = భార్య; అని = అని; కాదు = కాదు; నికృష్ట = నీచమైన; దాసి = పనిమనిషి; అనియును = అనైన; పిలువంగను = పిలుచుటకైన; చాలని = తగని; దుర్భగురాలను = దౌర్భాగ్యురాలను, ద్వేషింపబడు దానిని; అనగల = అనగలిగిన; నా = నా; కుక్షిన్ = కడుపున; ఉదయమందిన = పుట్టిన; కతనన్ = కారణముచేతను.

భావము:- భర్తచేత భార్యగానేకాదు, దాసిగాకూడా పిలువబడని దురదృష్ట వంతురాలినైన నా కడుపున పుట్టిన కారణంచేత నీకు అవమానం తప్పలేదు.

4-231-క.

నిను నాడిన యా సురుచి వ
చనములు సత్యంబు లగును; సర్వశరణ్యుం
డనఁగల హరిచరణంబులు
గను జనకుని యంక మెక్కఁగాఁ దలఁతేనిన్.

టీక:- నిను = నిన్ను; ఆడిన = అన్నట్టి; ఆ = ఆ; సురుచి = సురుచి; వచనములు = మాటలు; సత్యంబులు = నిజము; అగును = అవును; సర్వ = అందరికిని; శరణ్యుండు =

శరణమిచ్చువాడు; అనగల = అనగలిగిన; హరి = హరి; చరణంబులు = పాదములు; కను = పొందుము; జనకుని = తండ్రి; అంకము = ఒడిని; ఎక్కగాన్ = ఎక్కనలెనని; తలతేనిన్ = తలుస్తే.

భావము:- నీ సవతి తల్లి సురుచి నీతో పలికిన మాటలు వాస్తవమే. నీకు తండ్రి ఒడిలో కూర్చోవాలనే ఆశ ఉన్నట్లయితే అందరికీ దిక్కు అయిన హరి పాదాలను ఆరాధించు.

4-232-వ.

కావునం బినతల్లి యైన యా సురుచి యాదేశంబున నధోక్షజు నాశ్రయింపుము"అని వెండియు నిట్లనియె.

టీక:- కావునన్ = అందుచేత; పినతల్లి = పిన్ని, పిన్నమ్మ; ఐన = అయిన; ఆ = ఆ; సురుచి = సురుచి; ఆదేశంబునన్ = ఆజ్ఞాపించిన ప్రకారము; అధోక్షజున్ = హరిన్; అని = అని; వెండియున్ = ఇంకను; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- కనుక పినతల్లి ఐన ఆ సురిచి ఆజ్ఞను పాటించి విష్ణువును ఆశ్రయించు" అని తల్లి ఇంకా ఇలా అన్నది.

4-233-సీ.

"పరికింప నీ విశ్వపరిపాలనమునకై-
యర్థి గుణవ్యక్తుఁ డైనయట్టి
నారాయణుని పాదనళినముల్ సేవించి-
తగ బ్రహ్మ బ్రహ్మపదంబు నొందె;
ఘనుఁడు మీ తాత యా మనువు సర్వాంతర-
యామిత్వ మగు నేకమైన దృష్టిఁ
జేసి యాగముల యజించి తా భౌమ సు-
ఖములను దివ్యసుఖముల మోక్ష

4-233.1-తే.

సుఖములను బొందె నట్టి యచ్యుతునిఁ బరుని
వితత యోగీంద్ర నికర గవేష్యమాణ
చరణ సరసిజ యుగళు శశ్వత్ప్రకాశు
భక్తవత్సలు విశ్వసంపాద్యు హరిని.

టీక:- పరికింపన్ = పరిశీలించి చూసిన; ఈ = ఈ; విశ్వ = లోకములను; పరిపాలనమున్ = పరిపాలించుట; కై = కోసము; అర్థిన్ = కోరి; గుణ = గుణములచే; వ్యక్తుడు = తెలియబడువాడు; ఐనయట్టి = అయినటువంటి; నారాయణుని = హరి {నారాయణుడు - నారములు (నీరు) యందు వసించువాడు, విష్ణువు}; పాద = పాద ములు అనెడి; నళినముల్ = పద్మములు; సేవించి = పూజించి; తగన్ = అవశ్యము; బ్రహ్మ = బ్రహ్మదేవుడు; బ్రహ్మపదంబున్ = బ్రహ్మపదమును; ఒందెన్ = పొందెను; ఘనుడు = గొప్పవాడు; మీ = మీ; తాత = తాత; ఆ = ఆ; మనువు = స్వాయంభువ మనువు; సర్వ = సమస్తము; అంతర = లోను; యామిత్వము = వ్యాపించునది; అగు = అయిన; ఏకమైన = ఏకాగ్ర; దృష్టిన్ = దృష్టి; చేసి = తో; యాగముల = యజ్ఞములచే; యజించి = అర్చించి; తాన్ = తను; భౌమ = భూలోక; సుఖములను = సుఖములను; దివ్య = దేవలోక; సుఖములను = సుఖములను; మోక్ష = మోక్షము అనెడి.

సుఖములను = సుఖములను; పొందెన్ = పొందెను; అట్టి = అటువంటి; అచ్యుతుని = నారాయణుని {అచ్యుతుడు - చ్యుతము (పతనము) లేనివాడు, విష్ణువు}; పరుని = నారాయణుని {పరుడు — అతీత మైనవాడు, విష్ణువు}; వితత యోగీంద్ర నికరగవేష్యమాణచరణసరసిజయుగళు = నారాయణుని {వితత యోగీంద్ర నికర గవేష్యమాణ చరణ సరసిజ యుగళు - విస్తారమైన యోగీంద్ర సమూహములచే గవేష్యమాణ (వెదకబడుతున్న) పాదపద్మముల యుగళము (ద్వయము) కలవాడు, విష్ణువు}; శశ్వత్ప్రకాశు = నారాయణుని {శశ్వత్ప్రకాశుడు - శాశ్వతముగా ప్రకాశించువాడు, విష్ణువు}; భక్తవత్సలు = నారాయణుని {భక్తవత్సలుడు - భక్తులయెడ వాత్స ల్యము కలవాడు, విష్ణువు}; విశ్వసంపాద్యు = నారాయణుని {విశ్వసంపాద్యుడు - విశ్వ (లోకములను) సంపాద్యుడు (సంపాదింపదగినవాడు), విష్ణువు}; హరిని = నారాయణుని.

భావము:- "లోకాలను రక్షించడానికి సగుణస్వరూపాన్ని గ్రహించిన నారా యణుని పాదపద్మాలను ఆరాధించి బ్రహ్మదేవుడు బ్రహ్మపదాన్ని పొందాడు. నీ తాత అయిన స్వాయంభువ మనువు భగవంతుని సర్వాంతర్యామిత్వాన్ని గుర్తించి ఏకాగ్రతతో యజ్ఞాలను చేసి ఆ దేవదేవుని సేవించి ఇహలోక సుఖాలను, పరలోక సుఖాలను అనుభవించి పరమపదాన్ని పొందాడు. నాశం లేనివాడు, యోగీశ్వరులు అన్వేషించి ఆరాధించే పాదపద్మాలు కలవాడు, ఆయన అనంత కాంతిస్వరూపుడు, భక్తవత్సలుడు, విశ్వ సంసేవ్యుడు అయిన హరిని ఆశ్రయించు.

4-234-వ.

## మఱియును.

టీక:- మఱియును = ఇంకను.

భావము:- ఇంకా...

4-235-క.

కరతల గృహీత లీలాం
బురుహ యగుచుఁ బద్మగర్భముఖ గీర్వాణుల్
పరికింపం గల లక్ష్మీ
తరుణీమణిచేత వెదకఁ దగు పరమేశున్.

టీక:- కరతల = అరచేతిలో; గృహీత = చేపట్టిన; లీలాంబురుహ = విలాసమునకైన పద్మము కలామె; అగుచున్ = అవుతూ; పద్మగర్భ = బ్రహ్మదేవుడు; ముఖ = మొదలగు; గీర్వాణుల్ = దేవతలు; పరికింపంగల = ఎదురు చూడగల; లక్ష్మీ = లక్ష్మి అనెడి; తరుణీ = స్త్రీలలో; మణి = రత్నమువంటి యామె; చేతన్ = చే; వెదకన్ = వెతుకబడుతూ; తగు = ఒప్పియున్న; పరమేశున్ = విష్ణుమూర్తిని.

భావము:- బ్రహ్మ మొదలైన దేవతలు వెదకినా కనిపించని లక్ష్మీదేవి లీలాకమలాన్ని చేత ధరించి ఆ హరి కోసం వెదకుతూ ఉంటుంది. అటువంటి పరమేశ్వరుని (ఆశ్రయించు).

## నారదోపదేశంబు

4-236-వ.

నిజధర్మపరిశోభితంబైన యేకాగ్రచిత్తంబున నిలిపి సేవింపు; మమ్మహాత్మునికంటె నీదుఃఖంబపనయించువాఁ డన్యుండొక్క రుండు గలండే?" యని పలికినఁ బరమార్థ ప్రాప్తి హేతుకంబు లైన తల్లివాక్యంబులు విని తన్నుఁ దాన నియమించుకొని పురంబువెడలి చనునవసరంబున నారదుండు తద్వృత్తాంతం బెఱింగి, యచ్చటికిం జనుదెంచి, యతని చికీర్షితంబు దెలిసి, పాపనాశకరం బైన తన కరతలంబు నా ధ్రువుని శిరంబునం బెట్టి "మానభంగంబునకు సహింపని క్షత్రియుల ప్రభావం బద్భుతంబు గదా? బాలకుం డయ్యుఁ బినతల్లి యాడిన దురుక్తులు చిత్తంబునం బెట్టి చనుచున్నవాఁ" డని మనంబున నాశ్చర్యంబు నొంది "యో బాలక! సకల సంపత్సమృద్ధం బగు మందిరంబు దెగడి యొంటి నెందు నేగెదవు? స్వజన కృతం బగు నవమానంబుచే నిను సంతప్తుంగాఁ దలంచెద" ననిన ధ్రువుం

డిట్లనియె; సపత్నీమాతృ వాగిషుక్షతం బగు వ్రణంబు భగవద్ధ్యాన యోగ రసాయనంబున మాపికొందు "ననిన విని ధ్రువునికి నారదుం డిట్లనియె.

టీక:- నిజధర్మ = స్వధర్మముచే; పరిశోభితంబు = చక్కగ శోభకలిగినది; ఐన = అయిన; ఏకాగ్ర = ఏకాగ్రమైన; చిత్తంబునన్ = మనసులో; నిలిపి = నిలు పుకొని; సేవింపుము = పూజింపుము; ఆ = ఆ; మహాత్ముని = మహాత్ముని; కంటె = కంటె; నీ = నీ యొక్క; దుఃఖంబున్ = దుఃఖమును; అపనయించువాడు = పోగొట్టువాడు; అన్యుండు = ఇతరమైనవాడు; ఒక్కరుండు = ఒక్కడు; కలండే = ఉన్నాడా ఏమి; అని = అని; పలికినన్ = అనగా; పరమార్థ = మోక్షము, ఉత్తమ ప్రయోజనముల; ప్రాప్తి = లభించుటకు; హేతుకంబులు = కారణమైనవి; ఐన = అయిన; తల్లి = తల్లి యొక్క; వాక్యంబులు = మాటలు; విని = విని; తన్ను = తనను; తాన = తనే; నియమించుకొని = ఆజ్ఞాపించు కొని; పురంబున్ = ఊరినండి; వెడలి = బయటబడి; చను = వెళ్ళు; అవసరం బునన్ = సమయమునందు; నారదుండు = నారదుడు; తత్ = ఆ; వృత్తాం తము = సమాచారము; ఎఱింగి = తెలిసి; అచ్చటికి = అక్కడికి; చనుదెంచి = వచ్చి; అతని = అతని యొక్క; చికీర్షితంబు = చేయనిచ్చగించినది, సంకల్పించి నది; తెలిసి = తెలుసుకొని; పాప = పాపమును; నాశకరంబు = నాశనము చేయగలది; ఐన = అయిన; తన = తన యొక్క; కరతలంబున్ = అరచేతిని; ఆ = ఆ; ధ్రువుని = ధ్రువుని; శిరంబునన్ = తలపైన; పెట్టి = పెట్టి; మానభంగం బున్ = అభిమానునకు దెబ్బతగులుట; కున్ = కు; సహింపని = సహించని; క్షత్రియుల = రాజవంశీయుల; ప్రభావంబు = తేజస్సు; అద్భుతంబున్ = అద్భుతమైనది; కదా = కదా; బాలకుండు = చిన్నపిల్లవాడు; అయ్యున్ = అయినప్పటికిని; పినతల్లి = పిన్ని; ఆడిన = పలికిన; దురుక్తులు = తిట్లు; చిత్తం బునన్ = హృదయములో; పెట్టి = పెట్టుకొని; చనుచున్నవాడు = వెళుతున్నాడు; అని = అని; మనంబునన్ = మనసులో; ఆశ్చర్యంబున్ = ఆశ్చర్యమును; ఒంది = పొంది; ఓ = ఓ; బాలక = పిల్లవాడ; సకల = సమస్తమైన; సంపత్ = సంపదలతోను; సమృద్ధంబు = సమృద్ధిగ ఉన్నవి; అగు = అయిన; మందిరంబున్ = గృహమును; తెగడి = నిందించి; ఒంటిన్ = ఒంటరిగ; ఎందున్ = ఎక్కడకి; ఏగెదవు = వెళ్ళెదవు; స్వ = స్వంత; జన = వారిచే; కృతంబు = చేయబడిన; అవమానంబు = అవమానము; చేన్ = చేత; నిను = నిన్ను; సంతప్తున్ = మిక్కిలి బాధపడినవాడు; కాన్ = అగునట్లు; తలచెదన్ = అనుకొనె దను; అనినన్ = అనగా; ధ్రువుండు = ధ్రువుడు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను; సపత్నీ = సవితి; మాతృ = తల్లి యొక్క; వాక్ = మాటలు అనెడి; ఇషు = బాణములచే; క్షతంబున్ = గాయపడి నది; అగు = అయిన; వ్రణంబు = పుండు; భగవత్ = భగవంతుని; ధ్యాన = ధ్యానించుట అనెడి; యోగ = యోగ; రసాయనంబున = ఔషధమును; మాపి కొందు= మాన్పుకొంటాను; అనినన్ = అనగా; విని = విని; ధ్రువుని = ధ్రువుని; కిన్= కి; నారదుండు = నారదుడు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను.

భావము:- (హరిని) స్వధర్మాయత్తమైన ఏకాగ్రచిత్తంలో నిలిపి ఆరాధించు. ఆ మహాత్ముని కంటె నీ దుఃఖాన్నితొలగింప గలిగినవాడు మరొకడు లేడు." అన్నది సునీతి. పరమార్థసిద్ధికి కారణాలైన తల్లి మాటలను ధ్రువుడు విని తనకు తానే ఒక నిర్ణయానికి వచ్చి పట్టణం నుండి బయలుదేరాడు. ఆ సమయంలో నారదమహర్షి ఆ వృత్తాంతాన్ని తెలుసు కొని ధ్రువుని దగ్గరకు వచ్చి, అతని కోరికను తెలుసుకొని, పాపాలన్నిటినీ పారద్రోలే తన చల్లని చేతితో అతని శిరస్సును స్పృశించాడు. "గౌరవహానిని సహించని క్షత్రియుల తేజస్సు అద్భుతమైనది కదా! పసివాడై కూడ పినతల్లి పలికిన దుర్వాక్కులను మనస్సు లో ఉంచుకొని నగరంనుండి వెళ్ళిపోతున్నాడు" అని మనస్సులో ఆశ్చర్యపడి

"నాయనా! సకల సంపదలు కలిగిన గృహాన్ని విడిచి ఒంటరిగా ఎక్కడికి పోతున్నావు? బంధువులు చేసిన అవమానంచేత బాధపడుతున్నట్లు న్నావు" అని పలుకగా ధ్రువుడు ఇలా అన్నాడు "సవతితల్లి మాటల వల్ల అయిన గాయాన్ని భగవద్ధ్యానం అనే ఔషధంతో నయం చేసుకొంటాను". ధ్రువుని మాటలు విన్న నారదుడు ఇలా అన్నాడు.

4-237-క.

"విను పుత్రక! బాలుఁడవై
యనయంబును గ్రీడలందు నాసక్తమనం
బునఁ దిరిగెడు నిక్కాలం
బున నీ కవమానమానములు లే వెందున్.

టీక:- విను = వినుము; పుత్రక = అబ్బాయి; బాలుడవు = పిల్లవాడవు; ఐ = అయ్యి; అనయంబునున్ = ఎల్లప్పుడును; క్రీడలు = ఆటల; అందున్ = లో; ఆసక్తము = ఆసక్తి గల; మనంబునన్ = మనసులో; తిరిగెడు = వర్తించెడి; ఈ = ఈ; కాలంబునన్ = కాలములో; నీకున్ = నీకు; అవమానములు = అవమానములు; లేవు = లేవు; ఎందున్ = ఎక్కడను.

భావము:- "నాయనా! విను. ఎల్లప్పుడు ఆటలందు ఆసక్తిని చూపవలసిన ఈ పసివయస్సులో గౌరవాగౌరవాలను పట్టించుకొనవలసిన పని లేదు.

4-238-తే.

కాన మనమునఁ దద్వివేకంబు నీకుఁ
గలిగెనేనియు సంతోషకలితు లయిన
పురుషు లాత్మీయకర్మ విస్ఫురణఁ జేసి
వితత సుఖదుఃఖము లనుభవింతు రెపుడు.

టీక:- కాన= కావున; మనమునన్ = మనసులో; తత్ = ఆ; వివేకంబునన్ = తెలివిడి; నీకున్ = నీకు; కలిగెన్ = ఉన్నట్లు; ఏనియు = అయితే; సంతోష = సంతోషముతో;

కలితులు = కూడినవారు; అయిన = అయిన; పురుషులు = మానవులు; ఆత్మీయ = తమ యొక్క; కర్మ = కర్మల; విస్ఫురణన్ = కంపనలు; చేసి = వలన; వితత = విస్తారమైన; సుఖ = సుఖములను; దుఃఖములనన్ = దుఃఖములనను; అనుభవింతురు = అనుభవిస్తారు.

భావము:- కనుక మంచిచెడులను నిర్ణయించేవివేకం నీకు ఉన్నా విచారించకు. మానవులు తమ పూర్వకర్మలను బట్టి కలిగే సుఖదుఃఖాలను అనుభవిస్తూ ఉంటారు.

4-239-వ.

కావున వివేకంబుగల పురుషుండు దనకుంబ్రాప్తంబులగు సుఖ దుఃఖంబులు దైవవశంబులుగాఁ దలంచి తావన్మాత్రంబునం బరితుష్టుండగు; నీవును దల్లిచెప్పిన యోగమార్గప్రకారంబున సర్వేశ్వరానుగ్రహంబుఁ బొందెద నంటివేని.

టీక:- కావునన్ = అందుచేత; వివేకంబున్ = తెలివిడి; కల = కలిగిన; పురుషుండు = మానవుడు; తన = తన; కున్ = కు; ప్రాప్తంబులు = లభించి నవి; అగు= అయిన; సుఖదుఃఖంబులు= సుఖదుఃఖంబులను; దైవ= దేవునికి; వశంబులు = వశమైనవి; కాన్ = అయినట్లు; తలంచి = అనుకొని; తావత్ = అంత; మాత్రంబునన్ = మాత్రముచేత; పరితుష్టుండు = సంతోషముకలవాడు; అగు = అవుతాడు; నీవునున్ = నీవుకూడ; తల్లి = తల్లి; చెప్పిన = చెప్పిన; యోగమార్గ = యోగమార్గము; ప్రకారంబునన్ = ప్రకారముగ; సర్వేశ్వర = విష్ణుమూర్తి; అనుగ్రహంబున్ = అనుగ్రహమును; పొందెదన్ = పొందుతాను; అంటివేని = అంటుంటే.

భావము:- కనుక తెలివి గల మానవుడు తనకు కలిగే సుఖదుఃఖాలను దైవసంకల్పం వల్ల కలిగినవని భావించి, వానితోనే తృప్తిపడతాడు. కాదు, నీవు నీ తల్లి చెప్పిన యోగమార్గాన్ని అనుసరించి భగవంతుని దయను పొందుతాను అన్నట్లయితే...

4-240-సీ.

అనఘాత్మ! యోగీంద్రు లనయంబు ధరఁ బెక్కు-
జన్మంబు లందు నిస్సంగమైన
మతినిఁ బ్రయోగ సమాధినిష్ఠలఁ జేసి-
యైనను దెలియ లే రతని మార్గ;
మది గాన నతఁడు దురారాధ్యుఁ డగు నీకు-
నుడుగుము నిష్ఫలోద్యోగ మిపుడు
గాక నిశ్శ్రేయస కాముఁడ వగుదేనిఁ-
దండ్రి! వర్తించు తత్కా లమందుఁ

4-240.1-తే.

**బూని సుఖదుఃఖములు రెంటిలోన నెద్ది**
**దైవవశమునఁ జేకుఱు దానఁ జేసి**
**డెందమునఁ జాల సంతుష్టి నొందువాఁడు**
**విమలవిజ్ఞాని యన భువి వెలయుచుండు.**

టీక:- అనఘాత్మ = పుణ్యాత్మా; యోగ = యోగులలో; ఇంద్రులు = శ్రేష్ఠులు; అనయంబున్ = అవశ్యము; ధరన్ = భూమిపైన; పెక్కు = అనేకమైన; జన్మంబులు = జన్మలు; అందున్ = లో; నిస్సంగము = సంగములేనిది; ఐన = అయిన; మతిన్ = బుద్ధితో; ప్రయోగ = ఆచరణతో కూడిన; సమాధి = యోగసమాధి; నిష్ఫలన్ = నిష్ఫల; చేసి = వలన; ఐనను = అయినప్పటికిని; తెలియన్ = తెలిసికొన; లేరు = లేరు; అతని = అతని; మార్గమున్ = త్రోవ; అదిగాన = అందుచేత; అతడు = అతడు; దురారాధ్యుడు = ఆరాధించుట కష్టమైనవాడు; అగు = అగును; నీకున్ = నీకు; ఉడుగుము = వదులు; నిష్ఫల= ఫలితములేని; ఉద్యోగమున్=ప్రయత్నమును; ఇపుడు= ఇప్పుడు; కాక = లేదా; నిశ్శ్రేయస = మోక్షమును; కాముడువు = కోరువాడవు; అగుదేని = అయినట్లయితే; వర్తించు = వర్తించు; తత్ = ఆ; కాలము = కాలము; అందున్ = లో.

పూని = పూనుకొని; సుఖ = సుఖము; దుఃఖములు = దుఃఖములు; రెంటి = రెండింటి; లోనన్ = లోను; ఎద్ది = ఏది; దైవ = దేవునికి; వశమునన్ = వశమై; చేకుఱున్ = చేకూరుతుందో; దానన్ = దాని; చేసి = తో; డెందము నన్ = హృదయములో; చాలన్ = మిక్కిలి; సంతుష్టిన్ = సంతృప్తిని; ఒందు = పొందెడి; వాడు = వాడు; విమల = నిర్మలమైన; విజ్ఞాని = మంచిజ్ఞానము కలవాడు; అన = అనగా; భువిన్ = భూమిమీద; వెలయుచున్ = ప్రసిద్ధి కెక్కుతూ; ఉండు = ఉండును.

భావము:- పుణ్యాత్మా! యోగీంద్రులు పెక్కుజన్మలలో నిస్సంగులై తీవ్రమైన సమాధి యోగాన్ని అభ్యసించి కూడ ఆ దేవుని స్వరూపాన్ని తెలుసుకోలేరు. ఆ హరిని ఆరాధించడం నీకు చాల కష్టం. కాబట్టి వ్యర్థమైన ఈ ప్రయత్నాన్ని విడిచి పెట్టు. మోక్షాన్ని కోరుకున్నట్లయితే ముసలితనంలో దానికోసం ప్రయత్నించు. దైవవశాన సుఖదుఃఖాలలో ఏది కలిగినా మనస్సులో సంతోషించేవాడు విజ్ఞాని అనిపించుకుంటాడు.

4-241-వ.

**మఱియు గుణాఢ్యుం డగువానిం జూచి సంతోషించుచు నాభాసుం డగు వానిం జూచి కరుణించుచు సమానుని యెడ మైత్త్రి సలుపుచు వర్తించుచున్నవాఁడు తాపత్రయాదికంబులం దొఱంగు" నని నారదుండు పలికిన విని ధ్రువుం డిట్లనియె; "ననఘా! యీ శమంబు**

**సుఖదుఃఖహతాత్ములగు పురుషు లకు దుర్గమంబని కృపాయత్తుండ వైన నీచేత వినంబడె; నట్ల యినం బరభయంకరంబగు క్షాత్త్రధర్మం బునొందిన యవినీతుం డనగునేను సురుచిదురుక్తులను బాణం బులవలన వినిర్భిన్న హృదయుండ నగుట మదీయచిత్తంబున శాంతి నిలువదు; కావునం ద్రిభువనోత్కృష్టంబు ననన్యాధిష్ఠితంబునగు పదంబును బొంద నిశ్చయించిన నాకు సాధుమార్గంబు నెఱింగిం పుము; నీవు భగవంతుండగు నజుని యూరువువలన జనించి వీణా వాదన కుశలుండవై జగద్ధితార్థంబు సూర్యుండునుం బోలె వర్తింతు;" వనిన విని.**

టీక:- మఱియు = ఇంకను; గుణ = గుణమములలో; ఆఢ్యుండు = శ్రేష్ఠుడు; అగు = అయిన; వానినన్ = వానిని; చూచి = చూసి; సంతోషించుచున్ = సంతోషిస్తూ; ఆభాసుండున్ = తెలివి లేనివాడు, భ్రంశుడు; అగు = అయిన; వానిన్ = వానిని; చూచి = చూసి; కరుణించుచున్ = దయచూపుతూ; సమా నుని = సమానమైన వాని; ఎడన్ = అందు; మైత్రి = స్నేహము; సలుపుచున్ = చేస్తూ; వర్తించుచున్ = ఉండెడి; వాడు = వాడు; తాపత్రయ = తాపత్రయ ములు {తాపత్రయములు- 1ఆధ్యాత్మికము 2ఆదిదైవి తము 3 ఆదిభౌతికము అనబడు మూడు (3) కారణములచే కలుగు తాపములు (బాధలు)}; ఆదికంబులన్ = మొదలైనవానివలన; తొలంగును = తొలగును; అని = అని; నారదుండు = నారదుడు; పలికిన = పలుకగా; విని = విని; ధ్రువుండు = ధ్రువుడు; ఇట్లు = ఈ విధముగ; అనియెన్ = పలికెను; అనఘా = పుణ్యుడా; ఈ; శమంబు = శమము {శమము- శాంతగుణము, మనోవ్యాపారంబులను ఉపశమింపచేయుట}; సుఖ = సుఖము; దుఃఖ = దుఃఖములచే; హత = దెబ్బతిన్న; ఆత్ములు = మనసులు కలవారు; అగు = అయిన; పురుషులు = మానవుల; కున్ = కు; దుర్గమంబు = ఆచరించలేనిది; అని = అని; కృపాయత్తుండవు = దయగలవాడవు; ఐన = అయిన; నీ = నీ; చేతన్ = చేత; వినంబడెన్ = చెప్పితివి; అట్లు = ఆ విధముగ; అయినన్ = అయి నప్పటికిని; పర = శత్రువులకు; భయంకరంబు = భయముగొల్పునది; అగు = అయిన; క్షాత్ర = క్షత్రియ; ధర్మంబున్ = స్వభావమును; ఒందిన = పొందిన; అవినీతుం డను = జితేంద్రియుడను కానివాడను; అగు = అయిన; నేను = నేను; సురుచి = సురుతి యొక్క; దురుక్తులు = తిట్లు; అను = అనెడి; బాణంబులన్ = బాణముల; వలన = వలన; వినిర్భిన్న = ముక్కచెక్కలైన; హృదయుండన్ = హృదయము కలవాడను; అగుటన్ = ఔటవలన; మదీయ = నా యొక్క; చిత్తంబునన్ = మనసులో; శాతి = శాంతి; నిలువదు = నిలబడదు; కావునన్ = అందుచేత; త్రిభువన = ముల్లోకములందు {ముల్లోకములు - 1భూః 2భువస్ 3భువ లోకములు}; ఉత్కృష్టంబున్ = ఉన్నతమైనది; అనన్య = అనితరులచే; అధిష్ఠితంబున్ = ఎక్కబడినిది; అగు = అయిన; పదంబునున్ = స్థానమును; పొందన్ = పొందవలెనని; నిశ్చయించిన = నిశ్చయించు

కొన్ను; నాకున్ = నాకు; సాధు = చక్కటి; మార్గంబున్ = దారి; ఎఱింగింపుము = తెలుపుము; నీవు = నీవు; భగవంతుండు = భగవంతుడు; అగు = అయిన; అజుని = బ్రహ్మదేవుని; ఊరువు = తొడ; వలన = నుండి; జనించి = పుట్టి; వీణా = వీణను; వాదన = వాయించుట యందు; కుశలుండవు = నేర్పరివి; ఐ = అయ్యి; జగత్ = లోకములకు; హిత = మంచి; అర్థంబున్ = కొరకు; సూర్యునిన్ = సూర్యుని; పోలెన్ = వలె; వర్తింతువు = తిరిగెదవు; అనినన్ = అనగా; విని = విని.

భావము:- ఇంకా గుణవంతునిచూసి సంతోషిస్తూ, గుణహీనుని చూసి జాలిపడుతూ, తనతో సమానుడైనవానితో స్నేహం చేస్తూ ప్రవర్తించేవాని దరికి తాపత్రయాలు చేరవు" అన్న నారదుని మాటలు విన్న ధ్రువుడు ఇలా అన్నాడు. "పుణ్యాత్మా! సుఖదుఃఖాల వల్ల తెలివి కోల్పోయిన వారికి శాంతి లభించదని అన్నావు. శత్రువులకు భయం కలిగించే క్షాత్రధర్మాన్ని నేను అవలంబించాను. కనుక నాకు వినయం ఎక్కడిది? సురుచి పలికిన దుర్భాషలు అనే బాణాలచేత బ్రద్దలైన నా హృదయంలో శాంతికి తావు లేదు. కాబట్టి ముల్లోకాలలోను శ్రేష్ఠమైనది, ఇతరు లెవ్వరూ పొందనిది అయిన స్థానాన్ని నేను పొందా లని ఆశపడుతున్నాను. అందుకు నాకు చక్కని ఉపాయాన్ని ఉపదేశించు. నీవు బ్రహ్మ ఊరువునుండి జన్మించి, నేర్పుతో వీణను మ్రోగిస్తూ, లోకాలకు మేలును కూర్చే నిమిత్తం సూర్యభగవానిని వలె సంచరించే మహానుభావుడివి" అని చెప్పగా (నారదుడు) విని...

4-242-క.

నారదుఁ డిట్లను "నన్ఘ! కు
మారక! విను నిన్ను మోక్షమార్గంబునకున్
బ్రేరేచినవాఁ డిప్పుడు
ధీరజనోత్తముఁడు వాసుదేవుం డగుటన్.

టీక:- నారదుండు = నారదుడు; ఇట్లు = ఈ విధముగ; అను = అనెను; అనఘ = పుణ్యుడా; కుమారక = అబ్బాయి; విను = విను; నిన్ను = నిన్ను; మోక్ష = మోక్షము యొక్క; మార్గంబున్ = దారి; కున్ = కి; ప్రేరేచిన = పురికొల్పిన; వాడు = వాడు; ఇప్పుడు = ఇప్పుడు; ధీర = ధీరులైన; జన = వారికి; ఉత్తముడు = ఉత్తముడు; వాసుదేవుండు = విష్ణుమూర్తి; అగుటన్ = అయినందువలన.

భావము:- నారదుడిలా అన్నాడు "పుణ్యాత్మా! నాయనా! విను. నిన్ను మోక్ష మార్గాన్ని పొందడానికి ప్రేరేపించినవాడు పురుషోత్తముడైన వాసుదేవుడే. కనుక...

4-243-వ.

నీవు నమ్మహాత్ముని నజస్ర ధ్యాన స్రవణ చిత్తుండవై భజియింపుము.

టీక:- నీవు = నీవు; ఆ = ఆ; మహాత్మునిన్ = మహాత్ముని; అజస్ర = నిరంతర మైన; ధ్యాన = ధ్యానమునందు; ప్రవణ = ఆసక్తిగల; చిత్తుండవు = చిత్తము కలవాడవు; ఐ = అయ్యి; భజియింపుము = సేవించుము.

భావము:- నీవు ఆ మహాత్ముని ఏకాగ్రమైన చిత్తంతో సేవించు.

4-244-క.

పురుషుఁడు దవిలి చతుర్విధ
పురుషార్థశ్రేయ మాత్మఁ బొందెద ననినన్
ధరఁ దత్ప్రాప్తికి హేతువు
హరిపదయుగళంబు దక్క నన్యము గలదే?

టీక:- పురుషుడు = మానవుడు; తవిలి = పూని; చతుర్విధపురుషార్థ = చతుర్విధ పురుషార్థముల {చతుర్విధ పురుషార్థములు - 1ధర్మ 2అర్థ 3కామ 4మోక్షములు}; శ్రేయమున్ = శ్రేయస్సును; పొందెదను = పొందుతాను; అనినన్ = అన్నచో; ధరన్ = భూమ్మీద; తత్ = దాని; ప్రాప్తి = పొందుట; కున్ = కు; హేతువు = దారి; హరి = హరి; పద = పాదములు అనెడి; యుగళం బున్ = ద్వయము; తక్క = తప్పించి; అన్యమున్ = ఇతరమైనది; కలదే = ఉన్నదా ఏమి.

భావము:- ధర్మార్థకామమోక్షాలు అనబడే నాలుగు పురుషార్థాలను శ్రేయస్సును పొందాలి అని అనుకునే మానవునికి హరి పాదపద్మాలు తప్ప మరొక ఉపకరణము లేదు.

4-245-వ.

కావున.

టీక:- కావునన్ = అందుచేత.

భావము:- అందుచేత

4-246-క.

వర యమునానదితటమునఁ
హరి సాన్నిధ్యంబు శుచియు నతిపుణ్యమునై
పరఁగిన మధువనమునకును
సరసగుణా! చనుము మేలు సమకుఱు నచటన్.

టీక:- వర = శ్రేష్ఠమైన; యమునా = యమున అనెడి; నది = నది యొక్క; తటమునన్ = ఒడ్డున; హరి = విష్ణుమూర్తి; సాన్నిధ్యంబున్ = సాన్నిధానము; శుచియు = శుచి; అతి =

మిక్కిలి; పుణ్యమున్ = పుణ్యము; ఐ = అయ్యి; పరగిన = ప్రసిద్ధమైన; మధువనమున్ = మధువనము; కున్ = కు; సరసగుణా = మనోహర గుణములు కలవాడ; చనుము = వెళ్ళు; మేలు = మేలు; సమకుఱున్ = కలుగును.

భావము:- సుగుణనిధీ! యమునానది ఒడ్డున హరికి నివాసస్థానమూ, పవిత్రమూ, పుణ్యప్రదమూ అయిన మధువనానికి వెళ్ళు. అక్కడ నీకు మేలు కలుగుతుంది.

4-247-క.

**ఆ యమునా తటినీ శుభ**
**తోయములం గ్రుంకి నిష్ఠతో నచ్చట నా**
**రాయణునకును నమస్కృతు**
**లాయతమతిఁ జేసి చేయు యమనియమములన్.**

టీక:- ఆ = ఆ; యమునా = యమున యొక్క; తటనీ = ఒడ్డున; శుభ = శుభ్రమైన; తోయములన్ = నీటిలో; క్రుంకి = స్నానము చేసి; నిష్ఠ = నిష్ఠ; తోన్ = తో; అచ్చట = అక్కట; నారాయణన్ = నారాయణన; కును = కు; నమస్కృతులు = నమస్కారములు; ఆయత = దీర్ఘమైన, గొప్ప; మతిన్ = మనస్సు; చేసి = తో; చేయు = చేయుము; యమనియమములన్ = యమనియమముల సాధన.

భావము:- శుభాలను కలిగించే ఆ యమునానది నీటిలో స్నానం చేసి, నిశ్చలమైన బుద్ధితో నారాయణునికి నమస్కరించు. యమ నియమాలను అవలంబించు.

4-248-వ.

**మఱియు బాలుండ వగుటంజేసి వేదాధ్యయనా ద్యుచిత కర్మా నర్హుండ వయ్యు నుచితంబులగు కుశాజినంబులం జేసి స్వస్తిక ప్రముఖాసనంబులం గల్పించుకొని త్రివృత్ప్రాణాయామం బులచేతం బ్రాణేంద్రియ మనోమలంబులను చాంచల్య దోషం బులఁ బ్రత్యాహరించి స్థిరం బయిన చిత్తంబున.**

టీక:- మఱియున్ = ఇంకను; బాలుండవు = పిల్లవాడవు; అగుటన్ = అయినందు చేత; చేసి = వలన; వేద = వేదములను; అధ్యయన = అధ్యయ నము; ఆది = మొద లగు; ఉచిత = ఉచిత; కర్మా = కర్మలకు; అనర్హుండవు = అర్హత లేనివాడవు; అయ్యున్ = అయినప్పటికిని; ఉచితంబులు = ఉచిత ములు; అగు = అయిన; కుశ = దర్భలు; అజినంబులన్ = జింకచర్మములను; చేసి = పొంది; స్వస్తిక = స్వస్తికాసనము; ప్రముఖ = మొదలైనముఖ్య; ఆసనం బులన్ = ఆసనములను; కల్పించుకొని = వేసి; త్రివృత్ = మూడు (3) ఆవృత్తుల (రేచక, పూరక, కుంభకములు); ప్రాణాయామంబుల్ = ప్రాణాయా మముల;

చేతన్ = చేత; ప్రాణ = ప్రాణముల; ఇంద్రియ = ఇంద్రియముల; మనః = మానసిక; మలంబులను = మలినములను; చాంచల్య = చంచలము అనెడి; దోషంబులన్ = దోషములను; ప్రత్యాహరించి = పరిహరించి; స్థిరంబు = స్థిరము; అయిన = అయినట్టి; చిత్తంబునన్ = చిత్తముయందు.

భావము:- ఇంకా పసివాడవు కనుక వేదాలను పఠించే అర్హత నీకు లేకున్నా దర్భల తోను, జింకచర్మంతోను స్వస్తికం మొదలైన ఆసనాలను కల్పించుకొని, పూరకము రేచకము కుంభకము అనే ఈ మూడు విధాలైన ప్రాణాయామాలతో ప్రాణేంద్రియ మనోమలాలను పోగొట్టుకొని, చాంచల్య దోషాలను తొలగించు కొని, స్థిరమైన మనస్సుతో (హరిని ధ్యానించు).

4-249-సీ.

**ఆశ్రిత సత్ప్రసాదాభి ముఖుండును-**
**స్నిగ్ధప్రసన్నాననేక్షణుండు**
**సురుచిర నాసుండు సుభ్రూయుగుండును-**
**సుకపోల తలుఁడును సుందరుండు**
**హరినీల సంశోభితాంగుండుఁ దరుణుండు-**
**నరుణావలోక నోష్ఠాధరుండుఁ**
**గరుణాసముద్రుండుఁ బురుషార్థ నిధియును-**
**బ్రణతాశ్రయుండు శోభనకరుండు**

4-249.1-తే.

**లలిత శ్రీవత్సలక్షణ లక్షితుండు**
**సర్వలోక శరణ్యుండు సర్వసాక్షి**
**పురుష లక్షణ యుక్తుండుఁ బుణ్యశాలి**
**యసిత మేఘనిభశ్యాముఁ డవ్యయుండు.**

టీక:- ఆశ్రిత = ఆశ్రయించినవారికి; సత్ = మంచి; ప్రసాద = వరముల నిచ్చుట యందు; అభిముఖుండును = ముందుండువాడును; స్నిగ్ధ = మృదు వైన; ప్రసన్న = ప్రసన్నమైన; ఆనన = ముఖముతో; ఈక్షణుండు = చూసెడివాడు; సు= చక్కటి; రుచిర = ప్రకాశవంతమైన; నాసుండును = ముక్కు కలవాడును; సు = చక్కటి; భ్రూయుగుం డును = భ్రూయుగ్మముకల వాడును; సు = చక్కటి; కపోలతలుడును = చెంపలు కల వాడును; సుందరుండు = అందమైనవాడు; హరినీల = ఇంద్రనీలము వలె; సంశోభిత = చక్కగ శోభ కలిగిన; అంగుండు = అవయవములు కలవాడు; తరుణుండు = తరుణ వయస్సున

యుండువాడు; అరుణా = ఎఱ్ఱని; అవలోకన = చూపులు; ఓష్ఠ = పైపెదవి; అధరుండు = క్రింది పెదవి కలవాడు; కరుణా = దయకు; సముద్రుండున్ = సముద్రుడును; పురుషార్థ = చతుర్విధపురుషార్థములకు {చతుర్విధపురుషార్థములు- 1ధర్మ 2అర్థ 3కామ 4మోక్ష ములు}; నిధియున్ = నిధివంటి వాడును; ప్రణత = నమస్కరించినవారికి; ఆశ్రయుండును = ఆశ్రయము ఇచ్చువాడును; శోభన = మంగళ; కరుండు = ఒనగూర్చు వాడును;

లలిత = అందమైన; శ్రీవత్స = శ్రీవత్సము అనెడి; లక్షణ = పుట్టు మచ్చచేత; లక్షితుండు = కలవాడును; సర్వ = సమస్తమైన; లోక = లోకము లకు; శరణ్యుండు = శరణ్యము యైనవాడు; సర్వ = అన్నిటికిని; సాక్షి = సాక్షియైనవాడు; పురుష = పురుషుని; లక్షణ = లక్షణములు; యుక్తుండు = కలగినవాడు; పుణ్యశాలి = పుణ్య స్వరూపుడు; అసిత = నల్లని; మేఘ = మేఘముతో; నిభ = సమానమైన; శ్యాముడు = శ్యాముడు; అవ్యయుండు = నాశరహితుడు.

భావము:- శ్రీహరి ఆశ్రితుల యెడ అపారమైన కృపారసం చూపేవాడు. సుప్రసన్న మైన ముఖం, చల్లని చూపులు, అందమైన ముక్కు, సొగసైన కను బొమలు, చిక్కని చెక్కిళ్ళు కలిగిన చక్కనివాడు. ఇంద్రనీల మణులవలె ప్రకాశించే మేను కల పడుచువాడు. ఎఱ్ఱని నేత్రాలు, పెదవులు కలవాడు. దయా సముద్రుడు. పురుషార్థాలను ప్రసాదించేవాడు. నమస్కరించే వారికి ఆశ్రయ మిచ్చేవాడు. శుభాలను కలిగించేవాడు. శ్రీవత్సం అనే అంద మైన పుట్టుమచ్చ కలవాడు. సర్వలోక రక్షకుడు. సర్వమూ చూచేవాడు. ఉత్తమ లక్షణాలు కలిగిన పురుషోత్తముడు. పుణ్యస్వరూపుడు. నీలమేఘశ్యాముడు. అవ్యయుడు.

4-250-వ.

మఱియును.

టీక:- మఱియును = ఇంకను. భావము:- ఇంకా....

4-251-సీ.

హార కిరీట కేయూర కంకణ ఘన-
    భూషణుం డాశ్రిత పోషణుండు
లాలిత కాంచీకలాప శోభిత కటి-
    మండలుం డంచిత కుండలుండు
మహనీయ కౌస్తుభమణి ఘృణి చారు గ్రై-
    వేయకుం డానంద దాయకుండు
సలలిత ఘన శంఖ చక్ర గదా పద్మ-
    హస్తుండు భువన ప్రశస్తుఁ డజుఁడు

4-251.1-తే.

**కమ్ర సౌరభ వనమాలికా ధరుండు**
**హతవిమోహుండు నవ్యపీతాంబరుండు**
**లలిత కాంచన నూపురాలంకృతుండు**
**నిరతిశయసద్గుణుఁడు దర్శనీయతముఁడు.**

టీక:- హార = హారము; కిరీట = కిరీటము; కేయూర = భుజకీర్తులు; కంకణ = కంకణములు; ఘన = గొప్ప; భూషణుండు = ఆభరణములు ధరించిన వాడు; ఆశ్రిత = ఆశ్రయించినవారిని; పోషణుండు = పాలించువాడు; లాలిత = అందమైన; కాంచీ = మొలనూలు; కలాపము = ఆభరణముతో; శోభిత = శోభి ల్లుతున్న; కటి = కటి; మండలుండు = ప్రదేశము కలవాడు; అంచిత = అలంక రింపబడిన; కుండలుండు = కుండలములు కలవాడు; మహనీయ = గొప్ప; కౌస్తుభ = కౌస్తుభము అనెడి; మణి = మణి యొక్క; ఘృణి = కాంతులుకల వాడు; చారు = అందమైన; గ్రైవేయకుండు = కంఠహారములు కలవాడు; ఆనంద = ఆనందమును; దాయకుండు = ఇచ్చువాడు; సలలిత = అందముగల; ఘన = గొప్ప; శంఖ = శంఖము; చక్ర = చక్రము; గదా = గద; పద్మ = పద్మము; హస్తుండు = చేత కలవాడు; భువన = లోకముల; ప్రశస్తుడు = ప్రశంసించబడు వాడు; అజుడు = జన్మములేనివాడు.

కమ్ర = కమ్మని; సౌరభ = సువాసనలు కల; వనమాలికా = వన మాలలు {వనమాల - పూలు పత్రములు కూర్చిన దండ}; ధరుండు = ధరించిన వాడు; హత = పోగొట్టబడు; విమోహుండు = మోహములవాడు; నవ్య = కొత్త; పీతాంబరుండు = పట్టుబట్టలు కలవాడు; లలిత = అందమైన; కాంచన = బంగారు; నూపుర = అందెలచే; అలంకృతుండు = అలంకరించబడినవాడు; నిరతిశయ = అతిశయము కాని; సత్ = మంచి; గుణుండు = గుణములుకల వాడు; దర్శనీయతముఁడు = అత్యధికమైన చూడదగ్గవాడు {దర్శనీయుడు – దర్శనీయతరుడు – దర్శనీయతముఁడు}.

భావము:- ఆ శ్రీహరి హారాలు, కిరీటం, భుజకీర్తులు మొదలైన అలంకారా లతో అలరారుతూ ఉంటాడు. ఆయన ఆశ్రితులను పోషించేవాడు. అతని కటిప్రదేశం అందమైన మొలత్రాడుతో ప్రకాశిస్తూ ఉంటుంది. ఆయన చెవులకు మకరకుండలాలను ధరిస్తాడు. కౌస్తుభం అనే మణికాంతులతో అందమైన కంఠ మాలను ధరిస్తాడు. ఆయన ఆనందాన్ని కలిగించేవాడు. శంఖ చక్ర గదా పద్మా లను నాలుగు చేతులలో ధరించి ఉంటాడు. ఆయన లోకప్రసిద్ధుడు. కమ్మని సువాసనగల వనమాలను మెడలో వేసుకుంటాడు. ఆయన అజ్ఞానాన్ని పోగొట్టే వాడు. సరిక్రొత్త పచ్చని పట్టు వస్త్రాన్ని కట్టుకుంటాడు. మేలిమి బంగారు అందెలు ఆయన కాళ్ళకు అలంకరింపబడి ఉంటాయి. గొప్ప సద్గుణాలు కల వాడు. దర్శించవలసినవాడు.

4-252-క.

సరసమనోలోచన ము
త్కరుఁడును హృత్పద్మ కర్ణికా నివసిత వి
స్ఫుర దురునఖ మణిశోభిత
చరణ సరోజాతుఁ డతుల శాంతుఁడు ఘనుఁడున్.

టీక:- సరస = సరసమైన; మనః = మనస్సు అనెడి; లోచన = కన్ను లకు; ముత్కరుడును = సంతోషము కలిగించువాడు; హృత్ = హృదయము అనెడి; పద్మ = పద్మము యొక్క; కర్ణికా = బొడ్డునందు; నివసిత = నివసించెడి; విస్ఫురత్ = మెరుస్తున్న; ఉరు = పెద్దవైన; నఖ = గోర్లు అనెడి; మణి = మణులచే; శోభిత = శోభిల్లు తున్న; చరణ = పాదములనెడి; సరోజాతుడు = పద్మములు కలవాడు; అతుల = సాటిలేని; శాంతుడు = శాంతముకల వాడు; ఘనుడున్ = గొప్పవాడు.

భావము:- ఆ శ్రీహరి ఆశ్రితుల మనస్సులకు, కన్నులకు ఆనందాన్ని కలిగించేవాడు. భక్తుల హృదయ పద్మాలలో ప్రకాశించే పాదపద్మాలు కలవాడు. సాటిలేని శాంత స్వభావుడు. మహానుభావుడు.

4-253-వ.

అయిన పురుషోత్తముఁ బూజించుచు హృదయగతుండును, సాను రాగవిలోకనుండును, వరదశ్రేష్ఠుండునునగు నారాయణు నేకాగ్ర చిత్తంబునం ధ్యానంబుచేయుచు బరమ నివృత్తిమార్గంబున ధ్యాతుం డైన పురుషోత్తముని దివ్యమంగళస్వరూపంబు చిత్తంబునం దగిలిన మరల మగుడ నేరదు; అదియునుం గాక, యే మంత్రంబేని సప్త వాసరంబులు పఠియించిన ఖేచరులం గనుంగొను సామర్థ్యంబు గలుగు; నట్టి ప్రణవయుక్తం బగు ద్వాదశాక్షర కలితంబును దేశకాల విభాగ వేది బుధానుష్ఠితంబును నయిన "ఓం నమో భగవతే వాసుదేవాయ" యనెడి వాసుదేవ మంత్రంబునం జేసి.

టీక:- అయిన = అయినట్టి; పురుష = పురుషులలో; ఉత్తమున్ = ఉత్తముని; పూజించుచున్ = పూజిస్తూ; హృదయ = హృదయమునందు; గతుండును = ఉన్నవాడు; సానురాగ = అనురాగముతోకూడిన; విలోకనుండును = చూపులు కలవాడు; వరద = వరములను ఇచ్చుటలో; శ్రేష్ఠుండు = ఉత్తముడు; అగు = అయినట్టి; నారాయణున్ = విష్ణుమూర్తిని; ఏకాగ్ర = ఏకాగ్రత కల; చిత్తంబునన్ = మనసులో; పరమ = అత్యుత్తమమైన; నివృత్తి = వైరాగ్య; మార్గంబునన్ = మార్గమున; ధ్యానంబున్ = ధ్యానమును; చేయుచున్ =

చేస్తూ; ధ్యాతుండు = ధ్యానింపబడువాడ; ఐన = అయినట్టి; పురుషోత్తముని = విష్ణుమూర్తి; దివ్య = దివ్యమైన; మంగళ = శుభకరమైన; స్వరూపం బున్ = స్వరూపమును; చిత్తంబునన్ = మనసులో; తగిలినన్ = లగ్నమైనచో; మరల = మరల; మగుడనేరదు = వెనుదిరిగి పోలేదు; అదియునున్ = అంతే; కాక = కాకుండ; ఏ = ఏ; మంత్రంబు = మంత్రము; ఏని = అయితే; సప్త = ఏడు (7); వాసరంబులు = దినములు; పఠియించినన్ = పఠించినచో; ఖేచరులన్ = ఆకాశమున చరించువారిని; కనుంగొన = చూచుటకు; సామర్థ్యంబు = సామర్థ్యము; కలుగున్ = కలుగుతుందో; అట్టి = అటువంటి; ప్రణవ = ఓంకారముతో; యుక్తంబు = కూడినది; అగు = అయిన; ద్వాదశా = పన్నెండు (12); అక్షర = అక్షరములు; కలితంబున్ = కలిగినదియు; దేశ = దేశము; కాల = కాలము; విభాగ = విభాగములు; వేది = తెలిసిన; బుధ = జ్ఞానులచే; అనుష్ఠితం బును = అనుష్ఠానము చేయబడునదియు; అయిన = అయినట్టి; ఓంనమోభగవతేవాసు దేవాయ = ఓంనమోభగవతేవాసుదేవాయ; అనెడి = అనెడి; వాసుదేవ = వాసుదేవ; మంత్రంబున్ = మంత్రము; చేసి = వలన.

భావము:- అటువంటి పురుషోత్తముని పూజించు. హృదయంలో కుదురుకున్న వాడూ, అనురాగమయ వీక్షణాలు వెదజల్లేవాడూ, వరాలను ఇచ్చేవాడూ అయిన నారాయణుని అచంచలమైన మనస్సుతో ధ్యానించు. అప్పుడు ఆ పురుషోత్తముని దివ్యమంగళ విగ్రహం మనస్సులో సాక్షాత్కరించి స్థిరంగా నిలిచిపోతుంది. ఏ మంత్రాన్ని ఏడు దినాలు జపిస్తే దేవతలను దర్శించే శక్తి కలుగుతుందో, ఓంకారంతో కూడి, పన్నెండు అక్షరాలు కలిగి, దేశకాల విభాగాలను తెలుసుకొని జపించవలసిన “ఓం నమో భగవతే వాసుదేవాయ” అనే ఆ వాసుదేవ మంత్రాన్ని జపించాలి.

4-254-సీ. ★

దూర్వాంకురంబుల దూర్వాంకురశ్యాము-
జలజంబులను జారుజలజనయనుఁ
దులసీ దళంబులఁ దులసికా దాముని-
మాల్యంబులను సునైర్మల్య చరితుఁ
బత్రంబులను బక్షిపత్రునిఁ గడు వన్య-
మూలంబులను నాది మూలఘనుని
నంచిత భూర్జత్వగాది నిర్మిత వివి-
దాంబరంబులను పీతాంబరధరుఁ

4-254.1-తే.

**దనరు భక్తిని మృచ్ఛిలాదారు రచిత**
**రూపముల యందుఁ గాని నిరూఢమైన**
**సలిలముల యందుఁ గాని సుస్థలము లందుఁ**
**గాని పూజింపవలయు నక్కమలనాభు.**

టీక:- దూర్వార = గఱిక అనెడి గడ్డి; అంకురంబులన్ = లేత చివుళ్ళతో; దూర్వారాంకురశ్యాము = లేతగఱికవలె నవనవలాడు శ్యాముని; జలజంబులను = పద్మములతో; చారు = అందమైన; జలజనయనున్ = పద్మములవంటి కన్నులు కలవాని; తులసీదళంబులన్ = తులసిదళములతో; తులసీకాదామునిన్ = తులసిమాల ధరించిన వాని; మాల్యంబులన్ = మాలలతో; సు = మంచి; నైర్మల్య = నిర్మలమైన; చరితున్ = వర్తన కలవానిని; పత్రంబులన్ = ఆకులతో; పక్షి = గరుత్మంతుని; పత్రుని = రెక్కలకలవానిని; కడు = అనేకమైన; వన్య = అడవి; మూలం బులను = మూలికలతో; ఆదిమూలఘనుని = సృష్టికి మొదటి దుంప వంటి వానిని; అంచిత = చక్కటి; భూర్జ = బూరుగుదూది; త్వక్ = బట్ట; ఆది = మొదలైనవానిచే; నిర్మిత = చేయబడిన; వివిధ = రకరకముల; అంబరములను = వస్త్రములచేత; పీతాంబరధరునిన్ = విష్ణుమూర్తిని; తనరు = అతిశయించిన; భక్తిని = భక్తితో. మృత్ = మట్టి; శిలా = శిల; దారు = కఱ్ఱ; రచిత = చేయబడిన; రూపములన్ = బొమ్మలు; అందు = వలన; కాని = కాని; నిరూఢమైన = ప్రసిద్ధమైన; సలిలముల = జలముల; అందు = లో; కాని = కాని; సుస్థలముల = మంచి ప్రదేశముల; అందు = లో; కాని = కాని; పూజింపవలయున్ = పూజించవలెను; ఆ = ఆ; కమలనాభున్ = విష్ణుమూర్తిని {కమలనాభుడు - పద్మము నాభి యందు కలవాడు, విష్ణువు}.

భావము:- గరికపోచలవలె శ్యామలవర్ణం కల వాసుదేవుణ్ణి గరికపోచలతో, అందమైన పద్మాలవంటి కన్నులు కలిగినవానిని పద్మాలతో, తులసిదండలు ధరించేవానిని తులసీదళాలతో, మాలిన్యం లేని శీలం కలవానిని పూలమాలలతో, పక్షివాహనుని పత్రాలతో, లోకాలకు ఆదిమూలుడైన మహానుభావుని వనమూలికలతో, పచ్చని పట్టు వస్త్రాలు ధరించేవానిని నారబట్టలతో సేవించాలి. భగవంతుణ్ణి మృణ్మయ, శిలామయ, దారుమయ ప్రతిమలలో కాని, నిర్మల జలాలలో కాని, పవిత్ర స్థలాలలో కాని ఆరాధించాలి.

"ఓం నమో భగవతే వాసుదేవాయః" అనే ద్వాదశాక్షరీ మంత్రోపాసన విధానం నారదమునీశ్వరుడు పంచాబ్దముల ధ్రువునికి ఉపదేశిస్తున్నాడు. అతి శక్తివంతమైన తిరుగు లేని మహా మంత్రపూరిత ఘట్టమిది.

4-255-క.

**ధృత చిత్తుఁడు శాంతుండు ని**
**యత పరిభాషణుఁడు సుమహితాచారుఁడు వ**
**ర్ణిత హరిమంగళ గుణుఁడును**
**మితవన్యాశనుఁడు నగుచు మెలఁగఁగ వలయున్.**

టీక:- ధృత = ధారణగల; చిత్తుడు = చిత్తము కలవాడు; శాంతుడు = శాంతము కలవాడు; నియత = నియమించిన; పరిభాషణుండు = సంభాషణలు కలవాడు; సు = మంచి; మహిత = గొప్ప; ఆచారుడు = ఆచరణలు కలవాడు; వర్ణిత = వర్ణిస్తున్న; హరి = విష్ణుమూర్తి; మంగళ = శుభకరమైన; గుణుండును = గుణములు కలవాడు; మిత = మితమైన; వన్య = అడవిలో దొరుకువానిని; అశనుడు = తినువాడు; అగుచున్ = అవుతూ; మెలగవలయును = తిరుగవలెను.

భావము:- మనోనిగ్రహం కలవాడై, శాంతుడై, మితభాషియై, సదాచార సంపన్నుడై, శ్రీహరి కళ్యాణగుణాలను వర్ణిస్తూ కందమూలాలను మితంగా స్వీకరిస్తూ ఉండాలి.

4-256-వ.

**ఉత్తమశ్లోకుండగు పుండరీకాక్షుండు నిజమాయా స్వేచ్ఛావతార చరితంబుల చేత నచింత్యముగా నెద్దిచేయు నద్ది హృదయగతంబుగా ధ్యానంబు చేయం దగు; మఱియుఁ గార్యబుద్ధిం జేసి చేయంబడు పూజావిశేషంబులు వాసుదేవమంత్రంబున సర్వేశ్వరునికి సమర్పింపవలయు; నిట్లు మనోవాక్కాయకర్మంబులచేత మనోగతం బగు నట్లుగా భక్తి యుక్తంబు లయిన పూజల చేతఁ బూజింపం బడి, సర్వేశ్వ రుండు మాయాభిభూతులు గాక సేవించు పురుషులకు ధర్మాది పురు షార్థంబులలోన నభిమతార్థంబు నిచ్చు; విరక్తుండగువాఁడు నిరంతర భావం బయిన భక్తియోగంబునం జేసి మోక్షంబుకొఱకు భజియించు" నని చెప్పిన విని ధ్రువుండు నారదునకుం బ్రదక్షిణ పూర్వకంబుగా నమస్కరించి మహర్షి జనసేవ్యంబై సకలసిద్ధుల నొసంగుచు భగవ త్పాద సరోజాలంకృతం బయిన మధువనంబునకుం జనియె; నంత.**

టీక:- ఉత్తమ = ఉత్తములచే; శ్లోకుండు = స్తుతింపబడువాడు; అగు = అయిన; పుండరీకాక్షుండు = హరి; నిజ = తన; మాయా = మాయతోకూడిన; స్వేచ్ఛా = తన ఇచ్చానుసారము; అవతార = అవతరించుట; చరితంబులన్ = వర్తనల; చేతన్ = చే; చింత్యముగా = చింతింపదగినదిగ; ఎద్ది = ఏదయితే; చేయున్ = చేయునో; అద్ది = దానిని; హృదయగతంబుగా = హృదయమందుల; ధ్యానంబున్ = ధ్యానము; మఱియున్ = ఇంకను; కార్య = పూనిన; బుద్ధిన్ = బుద్ధి; చేసి = తో; చేయంబడు = చేసెడి; పూజా = పూజల; విశేషంబులన్ = విశేషములను; వాసుదేవమంత్రంబునన్ = వాసుదేవమంత్రముతో; సర్వేశ్వరుని = హరి; కిన్ = కి; సమర్పింపవలయు = చక్కగ అర్పింపవలెను; ఇట్లు = ఈ విధముగ; మనస్ = మనస్సు; వాక్ = మాటలు; కర్మంబుల = చేయుపనుల; చేతన్ = చే; మనః = మనసునకు;

గతంబు = చేరినది; అగునట్లుగా = అయ్యేటట్లుగా; భక్తి = భక్తితో; యుక్తంబులు = కూడినవి; అయిన = అయిన; పూజల = పూజలు; చేతన్ = చే; పూజింపంబడి = పూజింపబడి; సర్వేశ్వరుండు = విష్ణుమూర్తి; మాయా = మాయకి; అభిభూతులు = లొంగినవారు; కాక = కాకుండగ; సేవించు = సేవించెడి; పురుషులకు = పురుషులకు; ధర్మాది = ధర్మాది {ధర్మాది – 1ధర్మ 2అర్థ 3కామ 4మోక్షములు అనెడి చతుర్విధపురుషార్థములు}; పురుషార్థంబులన్ = పురుషార్థముల; లోనన్ = లో; అభిమతార్థంబున్ = కోరినది; ఇచ్చున్ = ఇచ్చును; విరక్తుండు = వైరాగ్యము కలవాడు; అగువాడు = అయినవాడు; నిరంతర = ఎడతెగని; భావంబున్ = భావము; అయిన = అయిన; భక్తి = భక్తి; యోగంబునన్ = యోగము; చేసి = వలన; మోక్షంబున్ = మోక్షము; కొఱకున్ = కోసము; భజియించు = సేవించు; అని = అని; చెప్పిన = చెప్పగ; విని = విని; ధ్రువుండు = ధ్రువుడు; నారదున = నారదున; కున్ = కు; ప్రదక్షిణ = ప్రదక్షిణతో; పూర్వకంబుగా = కూడినదిగా; నమస్కరించి = నమస్క రించి; మహర్షి = మహర్షులైన; జనంబు = వారిచే; సేవ్యంబు = సేవింపబడినది; ఐ = అయ్యి; సకల = సమస్తమైన; సిద్ధులను = సిద్ధులను; ఒసంగుచున్ = ఇస్తూ; భగవత్ = భగవంతుని; పాద = పాదములు అనెడి; సరోజ = పద్మములచే; అలంకృతంబు = అలంకరింపబడినది; అయిన = అయిన; మధు = మధు అనెడి; వనంబున్ = వనమున; కున్ = కు; చనియె = వెళ్ళెను; అంత = అంత.

భావము:- పురుషోత్తముడైన పుండరీకాక్షుడు తన మాయామహిమతో ఇచ్చాను సారంగా పెక్కు అవతారాలను ధరించి చేసిన లీలావిశేషాలను మనస్సులో భావించాలి. ఆత్మార్పణ బుద్ధితో చేసే పూజలను ద్వాదశాక్షర మంత్రంతో వాసుదేవునకు సమర్పిం చాలి. ఈ విధంగా త్రికరణ శుద్ధిగా భక్తితో పూజించేవారు విష్ణుమాయలో చిక్కుకొనరు. వారికి భగవంతుడు ధర్మార్థకామమోక్షాలు అనే పురుషార్థాలలో కోరిన దానిని అనుగ్రహిస్తాడు. విరక్తితో ముక్తిని కోరువాడు, ఎడతెగని భక్తిభావంతో సేవిస్తూ ఉంటాడు" అని నారదుడు ఉపదేశించగా ధ్రువుడు అతనికి ప్రదక్షిణం చేసి, నమస్కరించి, మహర్షులు నివసించేది, కోరిన కోరికలను ప్రసాదించేది, భగవంతుని పాదపద్మాలచేత అలంకరింప బడింది అయిన మధువనానికి బయలుదేరాడు.

## నారదు డుత్తానపాదుని ఊరడించుట

4-257-తే.

**పద్మభవ సూనుఁ డుత్తానపాదు కడకు**
**నరిగి యా రాజుచే వివిధార్చనముల**
**నంది సంప్రీతుఁడై యున్నతాసనమున**
**నెలమిఁ గూర్చుండి యాతని వలను చూచి.**

టీక:- పద్మభవ = బ్రహ్మదేవుని; సూనుడు = పుత్రుడు; ఉత్తానపాదు = ఉత్తానపాదుని; కడకున్ = దగ్గరకు; అరిగి = వెళ్ళి; ఆ = ఆ; రాజు = రాజు; చేన్ = చేత; వివధ = రకరకముల;

అర్చనములన్ = పూజనములను; అంది = పొంది; సంప్రీతుడు = సంతుష్టుడు; ఐ = అయ్యి; ఉన్నత = ఎత్తైన; ఆసనమునన్ = ఆసనమున; ఎలమిన్ = అతిశయించి; కూర్చుండి = కూర్చుని; ఆతని = అతని; వలను = వైపు; చూచి = చూసి.

భావము:- నారదుడు ఉత్తానపాదుని దగ్గరకు వెళ్ళి, ఆ రాజు చేసిన నానావిధాలైన పూజలను అందుకొని, ఆనందంతో ఉన్నతాసనంపై కూర్చున్నవాడై ఆ రాజు వంక చూచి...

4-258-వ.

ఇట్లనియె.

టీక:- ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికె.

భావము:- ఇలా అన్నాడు.

4-259-క.

"భూనాయక! నీ విపుడా
మ్లానాస్యుఁడ వగుచుఁ జాల మదిలోఁ జింతం
బూనుట కేమి కతం?"బన
నా నారదుతోడ నాతఁ డనియెన్ మరలన్.

టీక:- భూనాయక = రాజ {భూనాయకుడు - భూమికి నాయకుడు, రాజు}; నీవున్ = నీవు; ఇపుడున్ = ఇప్పుడు; ఆమ్లాన = మిక్కిలి వాడిన; ఆస్యుడవు = మోము కలవాడవు; అగుచున్ = అవుతూ; చాలన్ = మిక్కిలి; మది = మనసు; లోన్ = లో; చింతన్ = చింతను; పూనుట = కలిగి యుండుట; కున్ = కు; ఏమి = ఏమి; కతంబు = కారణము; అనన్ = అనగ; ఆ = ఆ; నారదున్ = నారదుని; తోడన్ = తోటి; ఆతడున్ = అతడు; అనియెన్ = పలికెను; మరలన్ = మరల.

భావము:- "రాజా! నీ వదనసరోజం వాడి ఉన్నది. నీ మనస్సులోని విచారానికి కారణం ఏమిటి?" అని ప్రశ్నించిన నారదునితో ఉత్తానపాదుడు ఇలా అన్నాడు.

4-260-క.

"మునివర! వివేకశాలియు
ననఘుఁడు నైదేండ్ల బాలుఁ డస్మత్ప్రియ నం
దనుఁ డదయుఁడ నగు నాచే
తను బరిభవ మొంది చనియెఁ దల్లియుఁ దానున్.

టీక:- ముని = మునులలో; వర = శ్రేష్ఠుడ; వివేకశాలియు = వివేకము కలవాడు; అనఘుడు = పుణ్యుడు; ఐదేండ్ల = అయిదు సంవత్సరముల; బాలుడు = బాలుడు; అస్మత్ = నా యొక్క; ప్రియ = ప్రియమైన; నందనుండు = పుత్రుడు; అదయుండను = దయమాలిన వాడిని; అగు = అయిన; నా = నా; చేతన్ = చేత; పరిభవంబున్ = పరాభవమును; ఒంది= పొంది; చనియెన్ = వెళ్ళెను; తల్లియన్ = తన అమ్మతో; తానున్ = తాను.

భావము:- "మునీంద్రా! నా ప్రియపుత్రుడు ధ్రువుడు ఐదేండ్లవాడు. మంచి తెలివితేటలు గలవాడు; పాపం ఎరుగనివాడు; అతనిని నేను దయమాలి అవమానించాను. అందుకు వాడు అలిగి తల్లితో పాటు వెళ్ళిపోయాడు.

4-261-మ.

**చని యుగ్రాటవిఁ జొచ్చి యచ్చటఁ బరిశ్రాంతుండు క్షుత్పీడితుం**
**డును నామ్లాన ముఖాంబుజుండు ననఘుండున్ బాలకుం డైన మ**
**త్తనయున్ ఘోర వృ కాహి భల్ల ముఖ సత్త్వశ్రేణి నిర్జించెనో**
**యని దుఃఖించెద నాదు చిత్తమున నార్యస్తుత్య! యిట్లౌటకున్.**

టీక:- చని = వెళ్ళి; ఉగ్ర = భయంకరమైన; అటవిన్ = అడవిని; చొచ్చి = ప్రవేశించి; అచ్చటన్ = అక్కడ; పరిశ్రాంతుండున్ = మిక్కిలి అలసినవాడు; క్షుత్పీడితుండును = ఆకలిచే పీడింపబడువాడు; ఆమ్లాన = వడలిపోయిన; ముఖ = ముఖము అనెడి; అంబుజుండున్ = పద్మము కలవాడు; అనఘుండు = పాపము లేని వాడు; బాలకుండు = చిన్న పిల్లవాడు; ఐన = అయిన; మత్ = నా యొక్క; తనయున్ = పుత్రుని; ఘోర = భయంకరమైన; వృక = తోడేళ్ళు; అహి = పాములు; భల్ల = ఎలుగుబంట్లు; ముఖ = మొదలైన; సత్త్వ = జంతువుల; శ్రేణి = సమూహము; నిర్జించెనో = సంహరించెనో; అని = అని; దుఃఖించెదన్ = దుఃఖిస్తున్నాను; నాదు = నా యొక్క; చిత్తమునన్ = మనసులో; ఆర్యస్తుత్య = గొప్పవారిచే స్తుతింపబడువాడ; ఇట్లు = ఈ విధముగ; ఔటకున్ = అగుటకు.

భావము:- అలా వెళ్ళి భయంకరమైన అడవిలో ప్రవేశించి మార్గాయాసంతోను, ఆకలి బాధతోను ముఖపద్మం వాడిపోయిన నా కుమారుణ్ణి, ఏపాపం ఎరుగని పసివాణ్ణి తోడేళ్ళు,సర్పాలు, ఎలుగుబంట్లుమొదలైన క్రూరజంతువులు పొట్టనబెట్టుకున్నాయేమో అనే భయంతో, బాధతో లోలోపల కుమిలిపోతున్నాను. మహానుభావా! ఇలా జరిగినందుకు నేను దుఃఖిస్తున్నాను.

4-262-తే.

**అట్టి యుత్తమబాలు నా యంకపీఠ**
**మందుఁ గూర్చుండనీక నిరాకరించి**
**యంగనాసక్త చిత్తుండ నైనయట్టి**
**నాదు దౌరాత్మ్య మిది మునినాథచంద్ర!"**

టీక:- అట్టి = అటువంటి; ఉత్తమ = ఉత్తముడైన; బాలున్ = బాలుని; నా = నా యొక్క; అంక = అంకము అనెడి; పీఠము = పీఠము; అందున్ = లో; కూర్చుండనీక = కూర్చోనీయక; నిరాకరించి = నిరాకరించి; అంగనా = స్త్రీ యెడల; ఆసక్త = చిక్కుకొన్న; చిత్తుండను = మనసు కలవాడను; ఐన = అయిన; అట్టి = అటువంటి; నాదు = నా యొక్క; దౌరాత్మ్యము = దురాత్ముని భావము; ఇది = ఇది; ముని = మునులకు; నాథ = నాయకులలో; చంద్ర = చంద్రునివంటివాడ.

భావము:- అటివంటి ఉత్తముడైన బాలుణ్ణి నా ఒడిలో కూర్చోనివ్వక అవమానించాను. మునీంద్రా! నా చిన్న భార్య సురుచి మీది వలపుతో ఈ దుర్మార్గపు పని చేశాను."

4-263-ఉ.

నా విని నారదుండు నరనాథున కిట్లను "నీ కుమారుఁ డా
దేవకిరీట రత్నరుచిదీపిత పాదసరోజుఁడైన రా
జీవదళాక్ష రక్షితుఁ డశేష జగత్పరికీర్తనీయ కీ
ర్తివిభవప్రశస్త సుచరిత్రుఁడు; వానికి దుఃఖ మేటికిన్?

టీక:- నా = అనగా; విని = విని; నారదుండు = నారదుడు; నరనాథున్ = రాజున; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగ; అను = అనెను; నీ = నీ యొక్క; కుమారుడు = పుత్రుడు; ఆ = ఆ; దేవకిరీటరత్నరుచిదీపితపాదసరోజుఁడు = విష్ణుమూర్తి {దేవ కిరీట రత్న రుచి దీపిత పాద సరోజుఁడు – దేవతల కిరీటముల కాంతులచే ప్రకాశిస్తున్న పాదములు అనెడి పద్మములు కలవాడు, విష్ణువు}; ఐన = అయిన; రాజీవదళాక్ష = విష్ణుమూర్తిచే; రక్షితుడు = రక్షింపబడుతున్నవాడు; అశేష = అనంతమైన; జగత్ = లోకములచే; పరి = మిక్కిలి; కీర్తనీయ = కీర్తింపదగిన; కీర్తి = కీర్తి యొక్క; విభవ = వైభవముచే; ప్రశస్త = శ్రేష్ఠమైన; సు = మంచి; చరిత్రుడు = ప్రవర్తన కలవాడు; వానికిన్ = అతనికోసము; దుఃఖము = దుఃఖము; ఏటికిన్ = ఎందులకు.

భావము:- ఉత్తానపాదుని మాటలు విని నారదుడు ఇలా అన్నాడు "రాజా! దేవతల కిరీటాల రత్నకాంతులతో ప్రకాశించే పాదపద్మాలు కల శ్రీహరి చేత రక్షింపబడే నీ కుమారుడు సమస్త లోకాలు ప్రస్తుతించే కీర్తి సంపదతో ప్రసిద్ధికెక్కిన చరిత్ర కలవాడు. అతనికోసం దుఃఖించడ మెందుకు?

4-264-ఉ.

కావున నమ్మహాత్ముఁడు సుకర్మము చేత సమస్త లోకపా
లావళి కందరాని సముదంచిత నిత్యపదంబునం బ్రభు
శ్రీ విలసిల్లఁ జెందుఁ దులసీదళదాము భజించి; యా జగ
త్పావనుఁడైన నీ సుతు ప్రభావ మెఱుంగవు నీవు భూవరా!

టీక:- కావునన్ = అందుచేత; ఆ = ఆ; మహాత్ముఁడు = మహాత్ముఁడు; సు = మంచి; కర్మము = కర్మములు; చేతన్ = చేత; సమస్త = సమస్తమైన; లోకపాల = లోకపాల కుల; ఆవళి = సమూహమున; కిన్ = కి; అందరాని = అందుకోలేని; సమ = మిక్కిలి; ఉదంచిత = గౌరవనీయమైన; నిత్య = శాశ్వతమైన; పదంబున్ = పదము నందు; ప్రభు = ప్రభుత్వము అనెడి; శ్రీ = సంపదతో; విలసిల్లన్ = విలసిల్లుటను; చెందు = చెందును; తులసీదళదాము = నారాయణుని {తులసీదళ దాము – తులసీదళముల దండ ధరించిన వాడు, విష్ణువు}; భజించి = పూజించి; ఆ = ఆ; జగత్ = లోకములను; పావనుడు = పవిత్రము చేయువాడు; ఐన = అయిన; నీ = నీ యొక్క; సుతు = పుత్రుని; ప్రభావమున్ = గొప్పదనము; ఎఱుంగవు = తెలియవు; నీవు = నీవు; భూవర = రాజ.

భావము:- రాజా! ఉత్తానపాదా! లోకపావనుడైన నీపుత్రుని ప్రభావం నీకు తెలియదు కాని. మహాత్ముడైన నీ కుమారుడు తన పుణ్యంతో తులసీదళదాముడైన నారాయణుని సేవించి లోకపాలకులు సైతం పొందరాని నిత్యపదానికి అధీశ్వరు డవుతాడు.

4-265-వ.

అదియునుం గాక.

టీక:- అదియున్ = అంతే; కాక = కాకుండగ.

భావము:- అంతేకాక...

4-266-క.

నీ కీర్తియు జగముల యం
దాకల్పము నొందఁజేయు నంచిత గుణర
త్నాకరుఁ డిట కేతెంచును
శోకింపకు మతనిఁ గూర్చి సుభగచరిత్రా!"

టీక:- నీ = నీ యొక్క; కీర్తియు = కీర్తినికూడ; జగములన్ = లోకముల; అందున్ = లో; ఆకల్పమున్ = కల్పాంతము వరకు; ఒందన్ = పొందునట్లు; చేయు = చేసెడి; అంచిత = చక్కటి; గుణ = గుణములనెడి; రత్నాకరుడు = సముద్రము వంటివాడు {రత్నాకరుడు – రత్నముల సమూహము కలవాడు, సముద్రుడు}; ఇటకున్ = ఇక్కడకు; ఏతెంచును = వచ్చును; శోకింపకుము = దుఃఖింపకుము; అతని = అతని; గూర్చి = గురించి; సుభగ = సౌభాగ్యమైన; చరిత్రా = ప్రవర్తనకలవాడ.

భావము:- పుణ్యాత్మా! నీ కుమారుడు నీ కీర్తిని కల్పాంతం వరకు సుస్థిరంగా ఉండేటట్లు చేస్తాడు. అతడు సుగుణ రత్నాకరుడు. అచిరకాలంలోనే నీ దగ్గరకు వస్తాడు. నీ పుత్రుని కోసం నీవు దుఃఖించవద్దు."

4-267-క.

**అని నారదుండు పలికిన**
**విని మనమున విశ్వసించి విభుఁడును బ్రియ నం**
**దనుఁ జింతించుచు నాదర**
**మునఁ జూడం డయ్యెఁ రాజ్యమును బూజ్యముగన్.**

టీక:- అని = అని; నారదుండు = నారదుడు; పలికిన = పలుకగా; విని = విని; మనమునన్ = మనసులో; విశ్వసించి = నమ్మి; విభుడును = రాజు; ప్రియ = ప్రియమైన; నందనున్ = పుత్రునికై; చింతించుచున్ = ఆలోచిస్తూ; ఆదరమునన్ = ఆదరముతో; చూడండు = చూడనివాడు; అయ్యెన్ = ఆయెను; రాజ్యమున్ = రాజ్యమును; పూజ్యముగన్ = శ్రద్ధగా.

భావము:- అని నారదుడు చెప్పిన మాటలను రాజు తన మనస్సులో విశ్వసించి, ప్రియపుత్రుని తలచుకొంటూ రాజ్యపాలన పట్ల పూర్తిగా నిరాదరం చూపసాగాడు.

4-268-వ.

**అంత నక్కడ నా ధ్రువుండు.**

టీక:- అంతన్ = అంత; అక్కడ = అక్కడ; ఆ = ఆ; ధ్రువుండు = ధ్రువుడు.

భావము:- ఆ సమయంలో అక్కడ ధ్రువుడు...

4-269-క.

**చని ముందటఁ గనుఁగొనె మధు**
**వనమును ముని దేవ యోగి వర్ణిత గుణ పా**
**వనమును దుర్భవ జలద ప**
**వనమును నిఖిలైక పుణ్యవరభవనంబున్.**

టీక:- చని = వెళ్ళి; ముందటన్ = ఎదురుగ; కనుగొనెన్ = చూసెను; మధు = మధు అనెడి; వనమునున్ = వనమును; ముని = మునుల; దేవ = దేవతల; యోగి = యోగులచే; వర్ణిత = స్తుతింపబడిన; గుణ = గుణములచే; పావనమును = పవిత్రమైనది; దుర్భవ = చెడ్డదైన సంసార మనెడి; జలద = మేఘములకు; పవనమును = వాయువు వంటిది; నిఖిల = సమస్తము; ఏక = అఖండ; పుణ్య = పుణ్యములకు; వర = శ్రేష్ఠమైన; భవనంబున్ = నివాసమును.

భావము:- (ధ్రువుడు) పోయి పోయి ఎదురుగా మధువనాన్ని చూశాడు. దాని పవిత్రతను మునులు, దేవతలు, యోగులు మొదలైన వారు వర్ణించారు. అది సంసారమనే మబ్బును చెదరగొట్టే ప్రభంజనం వంటిది. సకల పుణ్యాలకు తావైనది.

## ధ్రువుని తపంబు

4-270-వ.

**అట్లుగని డాయంజని యమునానదిం గృతస్నానుండై నియతుం డును, సమాహిత చిత్తుండును నై సర్వేశ్వరుని ధ్యానంబు చేయుచుం బ్రతిత్రిరాత్రాంతంబునఁ గృత కపిత్థ బదరీఫల పారణుం డగుచు దేహ స్థితి ననుసరించి యిటుల నొక్కమాసంబు హరిం బూజించి, యంత నుండి యాఱేసి దినంబుల కొక్కపరి కృతజీర్ణ తృణ పర్ణాహారుం డగుచు, రెండవ మాసంబున విష్ణుసమారాధనంబు చేసి, యంత నుండి నవరాత్రంబుల కొకమా ఱుదకభక్షణంబు చేయుచు, మూఁడవ మాసంబున మాధవు నర్చించి, యంతనుండి ద్వాదశ దినంబుల కొక మాఱు వాయుభక్షణుం డగుచు, జితశ్వాసుండై నాలవ మాసంబునం, బుండరీకాక్షుని భజియించి, యంతనుండి మనంబున నలయక నిరు చ్ఛ్వాసుండై యేకపదంబున నిలిచి, పరమాత్మఁ జింతించుచు, నచేత నంబైన స్థాణువుంబోలె నైదవ మాసంబును జరిపె; నంత.**

టీక:- అట్లు = ఆ విధముగ; డాయన్ = దగ్గరకు; చని = వెళ్ళి; యమునా = యమున అనెడి; నదిన్ = నదిలో; కృత = చేసిన; స్నానుండు = స్నానము చేసినవాడు; ఐ = అయ్యి; నియతుండును = నియమములను పూనినవాడు; సమ = చక్కగా; ఆహిత = కూడగట్టుకొనిన; చిత్తుండును = మనసు కలవాడు; ఐ = అయ్యి; సర్వేశ్వరుని = విష్ణుమూర్తిని; ధ్యానంబున్ = ధ్యానము; చేయుచున్ = చేస్తూ; ప్రతి = ప్రతి; త్రి = మూడు (3); రాత్రంబునన్ = రాత్రుల కొకమారు; కృత = చేసిన; కపిత్థ = వెలగ; బదరీ = రేగు; ఫల = పండ్లను; పారణుండు = భోజనము కలవాడు; అగుచున్ = అవుతూ; దేహ = శరీర; స్థితిని = స్థితిని; అనుసరించి = ప్రకారము; ఇటుల = ఈ విధముగ; ఒక్క = ఒక; మాసంబు = నెల; హరిన్ = విష్ణుని; పూజించి = పూజించి; అంతన్ = అప్పటి; నుండి = నుండి; ఆఱేసి = ఆరు చొప్పున; దినంబుల = దినముల; కున్ = కి; ఒక్క = ఒక; పరి = మారు; కృత = చేసిన; జీర్ణ = ఎండిన; తృణ = గడ్డి; పర్ణ = ఆకులు; ఆహారుండు = భోజనము కలవాడు; అగుచున్ = అవుతూ; రెండవ = రెండో (2); మాసంబునన్ = నెలలో; విష్ణు = విష్ణుమూర్తిని; సమ = చక్కగా; ఆరాధనంబు = పూజ; చేసి = చేసి; అంత = అప్పటి; నుండి = నుండి; నవ =

తొమ్మిది (9); రాత్రంబుల = రాత్రుల; కున్ = కి; ఒక = ఒక; మాఱున్ = మారు; ఉదక = నీటిని; భక్షణంబున్ = తీసుకొనుట; చేయుచున్ = చేస్తూ; మూడవ = మూడో (3); మాసంబునన్ = నెలలో; మాధవున్ = విష్ణుమూర్తిని; అర్చించి = పూజించి; అంత = అప్పటి; నుండి = నుండి; ద్వాదశ = పన్నెండు (12); దినంబుల = దినముల; కున్ = కి; ఒక = ఒక; మాఱున్ = మారు; వాయు = వాయువును; భక్షణుండు = తినువాడు; అగుచున్ = అవుతూ; జిత = జయించిన; శ్వాసుండు = శ్వాస కలవాడు; నాలవ = నాలుగో (4); మాసంబునన్ = నెలలో; పుండరీకాక్షునిన్ = విష్ణుమూర్తిని; భజియించి = పూజించి; అంత = అప్పటి; నుండి = నుండి; మనంబునన్ = మనసులో; అలయక = అలసిపోకుండగ; నిరు చ్ఛ్వాసుండు = ఊపిరివిడుచుట లేనివాడు; ఐ = అయ్యి; ఏక = ఒంటి; పదంబునన్ = కాలుమీద; నిలిచి = నిలబడి; పరమాత్మన్ = పరమాత్మను; చింతించుచున్ = ధ్యానిస్తూ; అచేతనంబున్ = కదలికలులేనిది; ఐన = అయిన; స్థాణువున్ = రాయి; పోలెన్ = వలె; ఐదవ = అయిదవ (5); మాసంబునున్ = నెలను; జరిపెన్ = గడిపెను; అంత = అంతట.

భావము:- ధ్రువుడు మధువనంలో ప్రవేశించి, యమునా నదిలో స్నానం చేసాడు. నియమంతో ఏకాగ్రచిత్తంతో భగవంతుణ్ణి ధ్యానింపసాగాడు. శరీరస్థితినిబట్టి మూడు దినాల కొకసారి వెలగపండ్లను, రేగుపండ్లను ఆరగిస్తూ ఒక్క నెల శ్రీహరిని అర్చిస్తూ గడిపాడు. తరువాత ఆరు దినాలకు ఒకసారి జీర్ణతృణపర్ణాలను తింటూ విష్ణుపూజలో రెండవ నెల గడిపాడు. తొమ్మిది దినాలకు ఒకమారు నీటిని త్రాగి మాధవసమారాధనలో మూడవ నెల గడిపాడు. అనంతరం పన్నెండు దినాల కొకసారి గాలిని ఆరగిస్తూ ఉచ్ఛ్వాస నిశ్వాసాలను నిరోధించి నారాయణ సేవలో నాలుగవ నెల గడిపాడు. తరువాత ఒంటికాలిపై నిలిచి పరమాత్ముణ్ణి భజిస్తూ ప్రాణం లేని మ్రోడులాగా నిశ్చలంగా ఐదవ నెల గడిపాడు.

4-271-సీ.

సకల భూతేంద్రి యాశయ మగు హృదయంబు-
  నందు విషయములఁ జెందనీక
మహదాది తత్త్వ సమాజమ్ములకును నా-
  ధార భూతమును బ్రధాన పూరు
షేశ్వరుఁ డైనట్టి శాశ్వత బ్రహ్మంబుఁ-
  దనదైన హృదయ పద్మమున నిలిపి
హరి రూపమున కంటె నన్యంబు నెఱుఁగక-
  చిత్త మవ్విభునందుఁ జేర్చియున్న

4-271.1-తే.

కతన ముల్లోకములు చాలఁ గంపమొందె;
వెండియును బేర్చి యయ్యర్భకుండు ధరణి
నొక్కపాదంబు చేర్చి నిల్చున్నవేళఁ
బేర్చి యబ్బాలు నంగుష్టపీడఁ జేసి.

టీక:- సకల = సమస్తమైన; భూత = భూతములకు; ఇంద్రియ = ఇంద్రియములకు; ఆశయము = ఆదారమైనది; అగు = అయిన; హృదయంబున్ = హృదయము; అందున్ = లోను; విషయములన్ = ఇంద్రియార్థములను, శబ్దాది విషయ సుఖములను; చెందనీక = చెందనీయకుండగ; మహదాది = మహత్తు మొదలైన {మహదాది – చతుర్వింశతి తత్వంబులు, (1)మహత్తు (1)పురుషుడు (1)ప్రకృతి (5)పంచభూతములు (5)పంచ తన్మాత్రలు (5)పంచకర్మేంద్రియములు (5)పంచజ్ఞానేంద్రియములు మరియు (1)అంతః కరణము మొత్తము 1+1+1+5+5+5+5+1 = 24}; తత్త్వ = తత్త్వముల; సమాజ మ్ముల్ = సమూహముల; కున్ = కి; ఆధారభూతమును = ఆధారమైనది; ప్రధాన = ప్రధానము అనబడెడి మూలత్త్వమునకు; పూరుష = పురుషుడు అనబడెడి జీవునకు; ఈశ్వరుడు = ప్రభువు; ఐనట్టి = అయినట్టి; శాశ్వతబ్రహ్మంబున్ = శాశ్వతబ్రహ్మమును; తనది = తనది; ఐన = అయిన; హృదయ = హృదయము అనెడి; పద్మమున = పద్మము యందు; నిలిపి = నిలిపికొని; హరి = హరి యొక్క; రూపమున్ = రూపమున; కంటెన్ = కంటెను; అన్యంబున్ = ఇతరమును; ఎఱుగక = తెలియక; చిత్తమున్ = మనసును; ఆ = ఆ; విభున్ = ప్రభువు; అందున్ = అందు; చేర్చి = చేర్చి; ఉన్న = ఉండిన.

కతన = కారణముచేత; ముల్లోకములున్ = ముల్లోకములును; చాలన్ = మిక్కిలిగ; కంపమున్ = వణకుట; ఒందెన్ = చెందెను; వెండియును = ఇంకను; పేర్చి = అతిశయించి; ఆ = ఆ; అర్భకుండు = పిల్లవాడు; ధరణిన్ = భూమిపైన; ఒక్క = ఒంటి; పాదంబున్ = పాదమును; చేర్చి = ఆధారముగా చేసికొని; నిల్చున్న = నిలబడిన; వేళన్ = సమయములో; పేర్చిన్ = అతిశయించిన; ఆ = ఆ; బాలున్ = పిల్లవాని; అంగుష్ట = కాలి బొటకనవేలి; పీడన్ = పీడనము, ఒత్తిడి; చేసి = వలన.

భావము:- ధ్రువుడు చాంచల్యం లేని తన హృదయంలో ఇతర విషయాలను చొరనీయలేదు. మహత్తు మొదలైన తత్త్వాలకు ఆధారభూతుడూ, ప్రకృతి పురుషులకు అధీశ్వరుడూ, శాశ్వతుడూ అయిన భగవంతుణ్ణి తన హృదయపద్మంలో నిలుపు కున్నాడు. శ్రీహరి రూపాన్ని తప్ప మరి దేనినీ మనస్సులో స్మరించకుండా తన చిత్తాన్ని తదాయత్తం చేసాడు. ఈ విధంగా ధ్రువుడు తీవ్రమైన తపస్సును సాగించాడు. అతని తపఃప్రభావాన్ని సహింపలేక ముల్లోకాలు కంపించాయి. ధ్రువుడు భూమిపై ఒంటికాలు మోపి నిలుచున్నాడు. అతని కాలి బొటనవ్రేలి ఒత్తిడికి...

4-272-తే.

**వసుమతీతల మర్ధము వంగఁ జొచ్చె**
**భూరిమద దుర్నివారణ వారణేంద్ర**
**మెడమఁ గుడి నొరగఁగ నడు గడుగునకును**
**జలన మొందు నుదస్థిత కలము వోలె.**

టీక:- వసుమతీ = భూమి; తలము = తలము; అర్ధము = సగము; వంగన్ = ఒరిగిపోవుట; చొచ్చెన్ = చెందెను; భూరి = అత్యధికమైన; మద = మదముచేత; దుర్నివారణ = నివారింపరాని; వారణ = ఏనుగులలో; ఇంద్రము = శ్రేష్ఠమైనది; ఎడమన్ = ఎడమపక్కకి; కుడిన్ = కుడిపక్కకి; ఒరగన్ = ఒరుగుతుండగ; అడుగడుగున్ = అడుగడుగున; కున్ = కి; చలనమొందును = కదలిపోవును; ఉదత్ = నీటియందు; స్థిత = ఉన్న; కలము = పడవ; పోలెన్ = వలె.

భావము:- మదపుటేనుగు కుడి ఎడమలకు ఒరిగినప్పుడు అడుగడుగునా కంపించే పడవలాగా సగం భూమి వంగి క్రుంగింది.

4-273-చ.

**అతఁడు నన్యదృష్టిని జరాచర దేహిశరీర ధారణా**
**స్థితి గల యీశునందుఁ దన జీవితమున్ ఘటియింపఁ జేసి యే**
**కతఁ గనఁ దన్నిరోధమునఁ గైకొని కంపము నొందె నీశ్వరుం;**
**డతఁడు చలింప నిజ్జగము లన్నియుఁ జంచల మయ్యె భూవరా!**

టీక:- అతడు = అతడు; అనన్య = అనితరమైన; దృష్టిని = దృష్టితో; చర = చలనము కల; అచర = చలనము లేని; దేహి = జీవుల; శరీర = శరీరములందు; ధారణా = ధారణ యొక్క; స్థితి = స్థితిలో; కల = ఉన్న; ఈశున్ = ఈశ్వరుని; అందున్ = అందు; తన = తన యొక్క; జీవితమున్ = ప్రాణమును; ఘటియింపన్ = కూర్చుట; చేసి = వలన; ఏకతన్ = ఐక్యమును; కనన్ = పొందగ; తత్ = దాని; నిరోధమునన్ = నిరోధమును; కైకొని = గ్రహించి; కంపమున్ = కంపించుటను; ఒందెన్ = పొందెను; ఈశ్వరుండు = ఈశ్వరుడు; అతడు = అతడు; చలింపన్ = చలించగ; ఈ = ఈ; జగములున్ = లోకములు; అన్నియున్ = సర్వము; చంచలము = మిక్కిలి చలించు నవి; అయ్యెన్ = అయినవి; భూవరా = రాజా.

భావము:- ధ్రువుడు ఏకాగ్రదృష్టితో చరాచర విశ్వానికి అధీశ్వరుడైన భగవంతుని ధ్యానించాడు. తదేక చిత్తంతో తన ప్రాణవాయువును నిరోధించి పరమేశ్వరునితో అనుసంధానం చేసాడు. ఈ విధంగా శ్వాసను నిరోధించడం వల్ల శ్రీహరి కంపించాడు. ఆయన కంపించగానే అఖిలలోకాలూ ప్రకంపించాయి.

4-274-క.

**ఆలోకభయంకర మగు**
**నా లోకమహావిపద్దశాలోకనులై**
**యా లోకపాలు రందఱు**
**నా లోకశరణ్యుఁ గాన నరిగిరి భీతిన్.**

టీక:- ఆలోక = చూచుటకు; భయంకరము = భీకరము; అగున్ = అయిన; ఆ = ఆ; లోక = లోకములకు; మహా = గొప్ప; విపత్ = ప్రమాదముల; దశా = దశను; ఆలోకనులు = చూసినవారు; ఐన = అయినట్టి; ఆ = ఆ; లోకపాలురు = లోకపాల కులు; అందఱున్ = అందరు; ఆ = ఆ; లోకశరణ్యున్ = నారాయణుని {లోకశరణ్యుడు - లోకములన్నిటికిని శరణ్యము యైనవాడు, విష్ణువు}; కానన్ = చూచుటకు; అరిగిరి = వెళ్ళిరి; భీతిన్ = భయముతో.

భావము:- లోకాలకు సంభవించిన ఆ చూడటానికి భయంకరమైన మహా విపత్తును చూచి అష్ట దిక్పాలకులు మొదలైన లోకపాలు రందరూ భయంతో లోకరక్షకుడైన హరిని దర్శించడానికి వెళ్ళారు.

4-275-వ.

**అట్లరిగి నారాయణు నుద్దేశించి కృతప్రణాములై కరంబులు ముకుళించి యిట్లనిరి.**

టీక:- అట్లు = ఆ విధముగ; అరిగి = వెళ్ళి; నారాయణున్ = హరిని; ఉద్దేశించి = ఎడల; కృత = చేసిన; ప్రణాములు = నమస్కారములు కలవారు; ఐ = అయ్యి; కరంబులున్ = చేతులు; ముకుళించి = జోడించి; ఇట్లు = ఈ విధముగ; అనిరి = పలికిరి.

భావము:- అలా వెళ్ళి దేవతలంతా నారాయణునికి నమస్కరించి చేతులు మోడ్చి ఇలా అన్నారు.

4-276-చ.

**"హరి! పరమాత్మ! కేశవ! చరాచర భూతశరీర ధారివై**
**పరఁగుదు వీవు; నిట్టులుగఁ బ్రాణనిరోధ మెఱుంగ మెందు ముం**
**దిరవుగ దేవదేవ! జగదీశ్వర! సర్వశరణ్య! నీ పదాం**
**బురుహము లర్థిమై శరణు బొందెద మార్తి హరించి కావవే!"**

టీక:- హరి = విష్ణుమూర్తి; పరమాత్మ = విష్ణుమూర్తి; కేశవ = విష్ణుమూర్తి; చర = చలనము కల; అచర = చలనము లేని; శరీర = జీవులయందు; ధారివి = ధారణకల వాడవు; ఐ = అయ్యి; పరగుదువు = ప్రవర్తిల్లువాడవు; ఈవు = నీవు; ఇట్టులగన్ = ఈ విధముగ; ప్రాణ

= ప్రాణముల; నిరోధమున్ = చేటు; ఎఱుంగము = తెలియము; ఎందున్ = ఎక్కడను; ముందు = ఇంతకుముందు; తిరవుగన్ = నిశ్చయముగ; దేవదేవ = హరి {దేవదేవుడు – దేవుళ్ళకి దేవుడు, విష్ణువు}; జగదీశ్వర = హరి {జగదీశ్వరుడు – జగత్తునకు ఈశ్వరుడు, విష్ణువు}; సర్వశరణ్య = హరి {సర్వశరణ్యుడు – సర్వులకి (అందరికి) శరణ్యుడు, విష్ణువు}; నీ = నీ యొక్క; పద = పాదములు అనెడి; అంబురుహముల్ = పద్మములు; అర్థిమై = కోరి; శరణు = శరణము; పొందెదమున్ = పొందు చున్నాము; ఆర్తిన్ = ఆర్తిని, బాధను; హరించి = పోగొట్టి; కావవే = కాపాడుము.

భావము:– "శ్రీహరీ! పరమాత్మా! కేశవా! నీవు సర్వప్రాణి శరీరాలలో అంతర్యామిగా ఉండే స్వామివి. పూర్వం ఎప్పుడూ ఈ విధంగా మాకు ప్రాణనిరోధం ప్రాప్తించలేదు. ఊపిరి ఆడక ఉక్కిరిబిక్కిరి అవుతున్నాము. జగదీశ్వరా! సర్వశరణ్యా! నీ చరణ కమలాలను శరణు కోరుతున్నాము. ఆపదను తొలగించి కాపాడు."

4-277-వ.

**అని దేవతలువిన్నవించిన నీశ్వరుండు వారలకిట్లనియె "నుత్తాన పాదుం డనువాని తనయుండు విశ్వరూపుండ నయిన నా యందుఁ దన చిత్తం బైక్యంబు చేసి తపంబు గావించుచుండ, దానంజేసి భవదీయ ప్రాణనిరోధం బయ్యెఁ; నట్టి దురత్యయం బైన తపంబు నివర్తింపఁ జేసెద వెఱవక మీమీ నివాసంబులకుం జనుం" డని యానతిచ్చిన నా దేవతలు నిర్భయాత్ములై యీశ్వరునకుఁ బ్రణామంబు లాచరించి త్రివిష్టపంబునకుం జనిరి; తదనంతరంబ.**

టీక:– అని = అని; దేవతలు = దేవతలు; విన్నవించిన = విన్నవించగ; ఈశ్వరుండు = నారాయణుడు; వారల = వారి; కిన్ = కి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను; ఉత్తానపాదుండు = ఉత్తానపాదుడు; అను = అనెడు; వాని = వాని; తన యుండు = పుత్రుడు; విశ్వ = విశ్వము; రూపుండను = రూపముగా కలవాడను; అయిన = అయిన; నా = నా; అందున్ = అందు; తన = తన యొక్క; చిత్తంబున్ = చిత్తమును; ఐక్యంబున్ = ఐక్యము; చేసి = చేసి; తపంబున్ = తపస్సును; కావించుచుండన్ = చేస్తుండగా; దానన్ = దాని; చేసి = వలన; భవదీయ = మీ యొక్క; ప్రాణ = ప్రాణము నకు; నిరోధంబు = నిరోధము; అయ్యెన్ = కలిగినది; అట్టి = అటువంటి; దురత్యయంబు = దాటరానిది; ఐన = అయిన; తపంబున్ = తపస్సును; నివర్తింపన్ = మానిపింప; చేసెదన్ = చేసెదను; వెఱవక = బెదరక; మీమీ = మీమీ; నివాసంబుల్ = నివాసముల; కున్ = కు; చనుండు = వెళ్ళండి; అని = అని; ఆనతిచ్చిన = చెప్పగా; ఆ = ఆ; దేవతలు = దేవతలు; నిర్భయ = భయములేని; ఆత్ములు = మనసులు కలవారు; ఐ = అయ్యి; ఈశ్వరున్ = హరి; కున్ = కి; ప్రణామంబులు = నమస్కారములు; ఆచరించి = చేసి; త్రివిష్టపంబు = స్వర్గమున {త్రివిష్టపము – త్రిదివము, మూడవలోకము, వ్యు. తృతీయం విష్టపము – త్రివిష్టపము, స్వర్గలోకము}, ముల్లోకముల; కున్ = కు; చనిరి = వెళ్ళిరి; తదనంతరంబ = తరువాత.

భావము:- అని దేవతలు విన్నవించగా శ్రీహరి వారితో ఇలా అన్నాడు. "ఉత్తాన పాదుని కొడుకు విశ్వస్వరూపుణ్ణి అయిన నాయందు తన మనస్సును సంధానం చేసి తపస్సు చేస్తు న్నాడు. అందువల్ల మీకు ప్రాణనిరోధం కలిగింది. ఆ బాలుణ్ణి తపస్సు నుండి విరమింప జేస్తాను. భయపడకండి. మీ మీ ఇండ్లకు వెళ్ళండి" అని ఆనతి నివ్వగా భయం తొలగిన దేవతలు వాసుదేవునకు నమస్కరించి తమలోకాలకు బయలుదేరి వెళ్ళారు. ఆ తరువాత...

## ధ్రువుని వరంబు

4-278-సీ.

హరి యీశ్వరుండు విహంగ కులేశ్వర-
యానుఁడై నిజభృత్యుఁడైన ధ్రువునిఁ
గనుఁగొను వేఁడుక జనియింప నా మధు-
వనమున కప్పుడు చని ధ్రువుండు
పరువడి యోగవిపాక తీవ్రంబైన-
బుద్ధిచే నిజమనోంబురుహ ముకుళ
మందుఁ దటిత్ప్రభాయత మూర్తి యటఁ దిరో-
ధానంబునను బొంది తత్క్షణంబ

4-278.1-తే.

తన పురోభాగమందు నిల్చినను బూర్వ
సమధికజ్ఞాన నయన గోచర సమగ్ర
మూర్తిఁ గనుఁగొని సంభ్రమముననను సమ్మ
దాశ్రువులు రాలఁ బులకీకృతాంగుఁ డగుచు

టీక:- హరి = విష్ణువు; ఈశ్వరుండు = విష్ణువు; విహంగకులేశ్వర = గరుడుని {విహంగకులేశ్వరుడు - విహంగ(పక్షుల)కు ప్రభువు, గరుడుడు}; యానము = వాహ నము ఎక్కినవాడు; ఐ = అయ్యి; నిజ = తన యొక్క; భృత్యుడు = సేవకుడు; ఐన = అయిన; ధ్రువుని = ధ్రువుని; కనుగొను = చూసెడి; వేడుక = కుతూహలము; జనియింపన్ = పుట్టగా; ఆ = ఆ; మధువనమున్ = మధువనమున; కున్ = కు; అప్పుడు = అప్పుడు; చని = వెళ్ళి; ధ్రువుండు = ధ్రువుడు; పరువడి = క్రమముగ; యోగ = యోగము యొక్క; విపాకము = పరిపక్వము చేత; తీవ్రంబు = తీక్షణము; ఐన = అయిన; బుద్ధి = బుద్ధి; చేన్ = చేత; నిజ = తన యొక్క; మనః = మనస్సు అనెడి; అంబురుహ = పద్మపు; ముకుళము = మొగ్గ; అందున్ = లో; తటిత్ = మెరపు; ప్రభా = ప్రకాశముతో; ఆయత = విస్తారమైన; మూర్తిన్ = స్వరూపము; అటన్ =

అక్కడ; తిరోధానంబునను = అదృశ్యమును; పొంది; తత్క్షణంబ = అదేక్షణములో. తన = తన యొక్క; పురోభాగము = ఎదుటి ప్రదేశము; అందున్ = లో; నిల్చినన్ = నిలబడగా; పూర్వ = ఇంతకుముందు; సమధిక = మిక్కిలి అధికమైన; జ్ఞాన = జ్ఞానము అనెడి; నయన = కన్నులకు; గోచర = కనబడిన; సమగ్ర = సమగ్రమైన; మూర్తిన్ = స్వరూపమును; కనుగొని = దర్శించి; సంభ్రమమునను = సంభ్రమము వలన; సమ్మద = ఆనంద; ఆశ్రువులు = బాష్పములు; రాలన్ = రాలుతుండగ; పులకీకృత = పులకరిస్తున్న; అంగుడు = దేహము కలవాడు; అగుచున్ = అవుతూ.

భావము:- భగవంతుడైన హరి గరుడవాహన మెక్కి తన భక్తుడైన ధ్రువుణ్ణి చూడాలనే ఉత్సాహంతో మధువనానికి వచ్చాడు. అప్పుడు ధ్రువుడు ధ్రువమైన భక్తియోగంతో, నిశ్చలమైన బుద్ధితో తన మనస్సులో ప్రకాశిస్తున్న శ్రీహరిని చూస్తూ ఉండటం చేత బయట ఉన్న శ్రీహరిని చూడలేకపోయాడు. ఇంతలో అతని మనస్సులోని మూర్తి మాయమై పోయింది. అప్పుడు ధ్రువుడు తనముందు సాక్షాత్కరించిన కరుణామూర్తిని కనుగొన్నాడు. తొట్రుపాటు చెందాడు. చెక్కిళ్ళపై ప్రవించే ఆనంద బాష్పాలతో స్వామిని తిలకించి పులకించాడు.

4-279-తే.

**నయనముల విభుమూర్తిఁ బానంబు చేయు**
**పగిదిఁ దన ముఖమునను జుంబనము చేయు**
**లీలఁ దగ భుజములను నాలింగనంబు**
**చేయుగతి దండవన్నమస్కృతు లొనర్చె.**

టీక:- నయనములన్ = కళ్ళతో; విభు = ప్రభువు యొక్క; మూర్తిన్ = స్వరూప మును; పానంబు = తాగుట; చేయు = చేస్తున్న; పగిదిన్ = విధముగ; తన = తన; ముఖమునను = ముఖమును; చుంబనము = ముద్దు; చేయు = పెట్టుకుంటున్న; లీలన్ = విధముగ; తగ = తగినట్లు; భుజములను = భుజములను; ఆలింగనంబున్ = కౌగలించుకొనుట; చేయు = చేస్తున్న; గతిన్ = విధముగ; దండవన్నమస్కృతుల్ = సాష్టాంగనమస్కారములు {దండవన్నమస్కృతులు - దండము (కఱ్ఱ)వలె పడి నమస్క రించుటలు}; ఒనర్చెన్ = చేసెను.

భావము:- తన కళ్ళతో స్వామి సౌందర్యాన్ని పానం చేస్తున్నట్లు, తన ముఖంతో స్వామిని ముద్దు పెట్టుకుంటున్నట్లు, తన చేతులతో స్వామిని కౌగిలించుకుంటున్నట్లు అనుభూతి పొందుతూ సాగిలపడి సాష్టాంగ నమస్కారం చేసాడు.

4-280-వ.

**ఇట్లు దండప్రణామంబు లాచరించి కృతాంజలి యై స్తోత్రంబు చేయ నిశ్చయించియు స్తుతిక్రియాకరణ సమర్థుండుఁ గాక యున్న ధ్రువున కును సమస్త భూతంబులకు నంతర్యామి యైన యీశ్వరుం డాతని**

తలంపెఱింగి వేదమయం బయిన తన శంఖంబు చేత నబ్బాలుని కపోలతలం బంటిన జీవేశ్వర నిర్ణయజ్ఞుండును, భక్తిభావనిష్ఠుం డును నగు ధ్రువుండు నిఖిలలోక విఖ్యాత కీర్తిగల యీశ్వరుని భగవ త్ప్రతిపాదితంబులగుచు వేదాత్మకంబులైన తన వాక్కుల నిట్లని స్తుతి యించె "దేవా! నిఖిలశక్తి ధరుండవు నంతఃప్రవిష్టుండవు నైన నీవు లీనంబు లైన మదీయ వాక్యంబులం బ్రాణేంద్రియంబులం గరచరణ శ్రవణత్వ గాదులను జిచ్ఛక్తిచేఁ గృపంజేసి జీవింపం జేసిన భగవం తుండవును, బరమపురుషుండవును నైన నీకు నమస్కరింతు; నీ వొక్కరుండవయ్యు మహదాద్యంబైన యీ యశేషవిశ్వంబు మాయాఖ్యం బయిన యాత్మీయశక్తిచేతం గల్పించి యందుం బ్రవేశించి యింద్రియంబు లందు వసించుచుఁ దత్తద్దేవతారూపంబు లచే నానా ప్రకారంబుల దారువు లందున్న వహ్ని చందంబునం బ్రకాశింతు; వదియునుం గాక.

టీక:- ఇట్లు = ఈ విధముగ; దండప్రణామంబులు = సాష్టాంగనమస్కారములు; ఆచరించి = చేసి; కృత = చేసిన; అంజలి = నమస్కారము కలవాడు; ఐ = అయ్యి; స్తోత్రంబు = స్తోత్రము; చేయ = చేయవలెనని; నిశ్చయించియు = సంకల్పించుకొని; స్తుతి = స్తోత్రము; క్రియా = చేయుటకు; కరణ = చేసెడి; సమర్థుండు = సమర్థత కలవాడు; కాక = కాకుండగ; ఉన్న = ఉన్నట్టి; ధ్రువున్ = ధ్రువుని; కున్ = కి; సమస్త = సమస్తమైన; భూతంబుల్ = జీవుల; కున్ = కి; అంతర్యామి = లోనుండువాడు; ఐన = అయిన; ఈశ్వరుండు = హరి; అతని = అతని; తలంపున్ = ఊహను; ఎఱింగి = తెలిసి; వేద = వేదములతో; మయంబున్ = నిండినది; అయిన = అయినట్టి; తన = తన; శంఖంబు = శంఖము; చేతన్ = తోటి; ఆ = ఆ; బాలునిన్ = పిల్లవాని; కపోల = చెక్కిలి; తలంబున్ = ప్రదేశమును; అంటిన = తాకిన; జీవ = జీవుని; ఈశ్వర = ఈశ్వరుని అనెడి; నిర్ణయజ్ఞుండును = నిర్ణయించు జ్ఞానము కలవాడు; భక్తిభావ = భక్తిభావమునందు; నిష్ఠుండును = నిష్ఠకలవాడును; అగు = అయిన; ధ్రువుండు = ధ్రువుడు; నిఖిల = సమస్తమైన; లోక = లోకములందు; విఖ్యాతి = ప్రసిద్ధమైన; కీర్తి = కీర్తి; కల = కలిగిన; ఈశ్వరుని = హరిని; భగవత్ = భగవంతునిగ; ప్రతిపాదితంబులు = నిర్ణయించెడివి; అగుచున్ = అవుతూ; వేద = వేదముల; ఆత్మకంబులు = స్వరూపం బులు; ఐన = అయిన; తన = తన; వాక్కులన్ = పలుకులతో; ఇట్లు = ఈ విధముగ; అని = అని; స్తుతియించె = స్తుతియించెను; దేవా = భగవంతుడా; నిఖిల = సమస్తమైన; శక్తి = సామర్థ్యములను; ధరుండవు = ధరించినవాడవు; అంతః = లోపల; ప్రవిష్టుండవు = ప్రవేశించినవాడవు; ఐన = అయిన; నీవు = నీవు; లీనంబులు = లీనమైపోయినవి; ఐన = అయిన; మదీయ = నా యొక్క; వాక్యంబులన్ = మాటను; ప్రాణ = ప్రాణములను;

ఇంద్రియంబులన్ = ఇంద్రియములను; కర = చేతులు; చరణ = కాళ్ళు; శ్రవణ = చెవులు; త్వక్ = చర్మము; ఆదులనున్ = మొదలగువాటిని; చిత్ = చేతన; శక్తి = శక్తి; చేన్ = చేత; కృపంజేసి = దయచేసి; జీవింపన్ = జీవించునట్లు; చేసిన = చేసిన; భగవంతుం డవును = మహా మహిమాన్వితుండవును {భగవంతుండు – మహా మహిమాన్వితుడు}; పరమ పురుషుండవును = పరమాత్మవవును {పరమపురుషుడు – సర్వాతీతమై సకల పురముల (దేహముల)లోను ఉండువాడు, పరమాత్మ}; ఐన = అయిన; నీకున్ = నీకు; నమస్కరింతు = నమస్కరించెదను; నీవు = నీవు; ఒక్కరుండవు = ఒకడివే; అయ్యు = అయి యుండియు; మహదాద్యంబు = మహదాదులతో కూడినది; ఐన = అయిన; ఈ = ఈ; అశేష = అనంతమైన; విశ్వంబున్ = విశ్వమును; మాయా = మాయ అనెడి; ఆఖ్యంబు = పేరుకలది; అయిన = అయిన; ఆత్మీయ = ఆత్మ యొక్క; శక్తిన్ = శక్తి; చేతన్ = చేత; కల్పించి = సృష్టించి; అందున్ = వాటిలో; ప్రవేశించి = చేరి; ఇంద్రియం బుల్ = ఇంద్రియముల; అందున్ = లో; వసించుచున్ = నివసిస్తూ; తత్తత్ = ఆయా; దేవతా = దేవతల; రూపంబులన్ = రూపముల; చేన్ = చేత; నానా = వివిధ; ప్రకారంబులన్ = రకములుగ; దారువులు =కొయ్యలు; అందున్ = లోపల; ఉన్న = ఉండెడి; వహ్ని = అగ్ని; చందంబునన్ = వలె; ప్రకాశింతువు = ప్రకాశిస్తుంటావు; అదియునున్ = అంతే; కాక = కాకుండగ.

భావము:- ఈ విధంగా సాష్టాంగ దండ ప్రణామం చేసి, చేతులు జోడించి శ్రీహరిని స్తుతించాలనుకొని, స్తుతి విధానం తెలియక మిన్నకున్నాడు ధ్రువుడు. సర్వాంతర్యామి యైన భగవంతుడు ధ్రువుని తలంపు గ్రహించి తన చేతిలో ఉన్న వేదమయమైన పాంచజన్య శంఖంతో ఆ బాలుని చెక్కిలిని స్పృశించాడు. ఆ ప్రభావం వల్ల జీవేశ్వర నిర్ణయాన్ని గుర్తించిన ధ్రువుడు భక్తిభావంతో భగవంతుడు ప్రసాదించిన వేదవాక్కులతో విశ్వవిఖ్యాతుడైన ఈశ్వరుణ్ణి ఇలా స్తుతించాడు. "దేవా! నీవు అఖిల శక్తిసంపన్నుడవు. అంతర్యామివి. స్తంభించిపోయిన నా వాక్కులను, ప్రాణాలను, నా కరచరణాది సకలేంద్రియా లను దయతో జ్ఞానాత్మకమైన నీ శక్తివల్ల తిరిగి బ్రతికించిన భగవంతుడవు. పరమ పురుషుడవైన నీకు నమస్కారం. నీవు ఒక్కడవే అయినప్పటికీ నీ మాయాశక్తిచేత ఈ సమస్త విశ్వాన్ని సృజిస్తావు. ఆ విశ్వంలో ప్రవేశిస్తావు. ఇంద్రియాలతో నివసిస్తావు. అగ్ని ఒక్కటే అయినా ఎన్నో దారువులలో ప్రకాశించే విధంగా నీవు ఆయా దేవతారూపాలలో ప్రవేశించి ప్రకాశిస్తావు.

4-281-చ.

**వరమతి నార్తబాంధవ! భవద్ఘన బోధసమేతుఁడై భవ**
**చ్చరణముఁ బొంది నట్టి విధి సర్గము సుప్తజనుండు బోధమం**
**దరయఁగఁ జూచురీతిఁ గనునట్టి ముముక్షు శరణ్యమైన నీ**
**చరణములం గృతజ్ఞుఁడగు సజ్జనుఁ డెట్లు దలంపకుండెడున్?**

టీక:- వర = శ్రేష్ఠమైన; మతిన్ = బుద్ధితో; ఆర్తబాంధవ = బాధలలో ఉన్నవారికి చుట్టము వంటివాడ; భవత్ = నీ యొక్క; ఘన = గొప్ప; బోధ = జ్ఞానము, బోధము; సమేతుండు = కూడినవాడు; ఐ = అయ్యి; భవత్ = నీ యొక్క; చరణమున్ = పాదమును; పొందిన = చెందిన; అట్టి = అటువంటి; విధి = బ్రహ్మదేవుని; సర్గమున్ = సృష్టిని; సుప్త = నిద్రించిన; జనుండు = వాడు; బోధము = మెలుకువ; అందున్ = లో; అరయగన్ = విచారించి; చూచున్ = చూసెడి; రీతిన్ = విధముగ; కనునట్టి = కనబడెడి; ముముక్ష = మోక్షము కోరెడివారికి; శరణ్యము = దిక్కు; ఐన = అయిన; నీ = నీ; చరణములన్ = పాదములను; కృతజ్ఞుండు = కృతజ్ఞుడు; అగు = అయినట్టి; సత్ = మంచి; జనుడు = వాడు; ఎట్లు = ఏ విధముగ; తలంపక = ధ్యానించకుండ; ఉండెడున్ = ఉండగలడు.

భావము:- దీనబాంధవా! నిద్రనుండి మేలుకొన్నవాడు మళ్ళీ ప్రపంచాన్ని చూసినట్లుగా బ్రహ్మదేవుడు నిన్ను శరణు పొంది నీవు ప్రసాదించిన జ్ఞానంచేత ఈ సమస్త ప్రపంచాన్ని సందర్శిస్తాడు. మోక్షం కోరే వారికి శరణాలైన నీ చరణాలను కృతజ్ఞుడైన సజ్జనుడు ఎలా మరచిపోగలడు?

4-282-సీ.

**మహితాత్మ! మఱి జన్మమరణ ప్రణాశన-**
**హేతు భూతుండవు నిద్ధకల్ప**
**తరువవు నగు నిన్నుఁ దగనెవ్వరే నేమి-**
**పూని నీ మాయా విమోహితాత్ము**
**లగుచు ధర్మార్థ కామాదుల కొఱకుఁ దా-**
**మర్చించుచును ద్రిగుణాభమైన**
**దేహోపభోగ్యమై దీపించు సుఖముల-**
**నెనయంగ మదిలోన నెంతు; రట్టి**

4-282.1-తే.

**విషయ సంబంధ జన్యమై వెలయు సుఖము**
**వారికి నిరయమందును వఱలు దేవ!**
**భూరి సంసార తాప నివార గుణ క**
**థామృతాపూర్ణ! యీశ! మాధవ! ముకుంద!**

టీక:- మహితాత్మ = హరి {మహితాత్మ - మహిమ కలవాడ, విష్ణువు}; మఱి = మరి; జన్మ = జన్మలు; మరణ = మరణములను; ప్రణాశన = పూర్తిగ నాశింపజేయుటకు; హేతు భూతుండవు = కారణమైనవాడవు; ఇద్ధ = ప్రసిద్ధమైన; కల్పతరువవు = కల్పతరువువంటి వాడవు; అగు = అయిన; నిన్నున్ = నిన్ను; తగన్ = తగి; ఎవ్వరు = ఎవరు; ఏనేమి = అయినా

సరే; పూని = నిశ్చయముతో; నీ = నీ; మాయా = మాయచేత; విమోహిత = బాగుగ మోహ ములోపడిన; ఆత్ములు = వారు; అగుచున్ = అవుతూ; ధర్మ = ధర్మము; అర్థ = అర్థము; కామ = కామము; ఆదుల = మొదలగువాటి; కొఱకున్ = కోసము; తాము = తాము; అర్చించు చున్ = పూజిస్తూ; త్రిగుణ = సత్త్వరజస్తమో (త్రి) గుణములతో; ఆభము = ప్రదీప్తము; ఐన = అయిన; దేహ = శరీరమునకు; ఉపభోగ్యము = అనుభవించదగినవి; ఐ = అయ్యి; దీపించు = ప్రకాశించు; సుఖములన్ = సుఖములను; ఎనయంగన్ = పొందుటకు; మదిన్ = మనసు; లోనన్ = లోను; ఎంతురు = ఎంచుకొనెదరు; అట్టి = అట్టి.

విషయ = విషయములకు; సంబంధ = సంబంధముతో; జన్యము = పుట్టినది; ఐ = అయ్యి; వెలయు = విలసిల్లు; సుఖమున్ = సుఖములు; వారికి = వారికి; నిరయము = నరకము; అందును = లో కూడ; వఱలు = ప్రవర్తిల్లు; దేవ = దేవుడ; భూరిసంసారతాప నివారగుణకథామృతాపూర్ణ = విష్ణుమూర్తి {భూరి సంసారతాప నివార గుణకథామృతా పూర్ణ- అత్యధికమైనసంసారతాపములను నివారించుగుణముకల కథల అమృతమున నిండినవాడు, విష్ణువు}; ఈశ = విష్ణుమూర్తి; మాధవా = విష్ణుమూర్తి; ముకుంద = విష్ణుమూర్తి.

భావము:- మహానుభావా! దేవా! మాధవా! ముకుందా! అపారమైన సంసార తాపాలను నివారించే సుగుణాలతో కూడిన కథాసుధాపూరం కలవాడా! జనన మరణాలను తొలగించి నీవు ప్రాణులను రక్షిస్తావు. తమ తమ కోరికలు నెరవేరటం కోసం నిన్ను సేవించేవారు నీ మాయచేత మోసగింపబడినవారే. భక్తజన కల్పవృక్షం అయిన నిన్ను దైహికాలైన ఐహికసుఖాలకోసం కొందరు సేవిస్తారు. విషయ సంబంధమైన సుఖం నరకంలో కూడా లభిస్తుంది.

4-283-మ.

**అరవిందోదర! తావకీన చరణధ్యానానురాగోల్లస**
**చ్చరితాకర్ణనజాత భూరిసుఖముల్ స్వానందకబ్రహ్మ మం**
**దరయన్ లేవఁట; దండ భృద్భట విమానాకీర్ణులై కూలు నా**
**సురలోకస్థులఁ జెప్పనేల? సుజనస్తోత్రైక చింతామణీ!**

టీక:- అరవిందోదర = విష్ణుమూర్తి {అరవిందోదరుడు - అరవిందము (పద్మము) ఉదరమున కలవాడు, విష్ణువు}; తావకీన = నీ యొక్క; చరణ = పాదములను; ధ్యాన = ధ్యానించుట యందు; అనురాగన్ = ప్రీతిని; ఉల్లసత్ = ఉత్సాహపరిచెడి; చరిత్ర = కథలు; ఆకర్ణన = వినుటలువలన; జాత = పుట్టెడు; భూరి = అత్యధికమైన; సుఖముల్ = సౌఖ్యములు; స్వానందకబ్రహ్మము = ఆత్మానందక బ్రహ్మము; అందన్ = లోకూడ; పరికింపన్ = వెదకి చూసిన; లేవట = లేవు అట; దండభృత్ = యమధర్మరాజు; భట = భటులచే; విమాన = విమానము అందు; ఆకీర్ణులు = చెదరిపోయినవారు; ఐ = అయ్యి; కూలున్ = కూలెడి; ఆ = ఆ; సురలోకస్థులన్ = దేవతలను; చెప్పన్ = చెప్పుట; ఏలన్ =

ఎందులకు; సు = మంచి; జన = వారిచే; స్తోమ = సమూహము; ఏక = ఒక్కడే యైన; చింతా = కోరినవి; మణీ = ఇచ్చెడి రత్నము వలె శ్రేష్ఠుడ.

భావము:- పద్మనాభా! సాధుజన చింతామణీ! నీ పాదస్మరణం వల్లను, అనురాగ సుధలు చిందే నీ కథలను వినటం వల్లను ప్రాప్తించే పరమసుఖం స్వాత్మానందంతో సమానమైన మోక్షంలో కూడ లభించదంటారు. ఇక యముని కాలదండం చేత విరిగిపడే విమానాల నుండి కూలిపోతున్న వేలుపుల మాట వేరే చెప్పటం దేనికి?

4-284-చ.

**హరి! భజనీయ మార్గనియతాత్మకులై భవదీయ మూర్తిపై**
**వఱలిన భక్తియుక్తు లగువారల సంగతిఁ గల్గఁజేయు స**
**త్పురుష సుసంగతిన్ వ్యసనదుస్తర సాగర మప్రయత్నతన్**
**సరస భవత్కథామృత రసంబున మత్తుఁడనై తరించెదన్.**

టీక:- హరి = నారాయణ; భజనీయ = పూజించదగిన; మార్గ = విధమున; నియతా = నియమించుకొనిన; ఆత్మకులు = మనసులు కలవారు; ఐ = అయ్యి; భవదీయ = నీ యొక్క; మూర్తిన్ = స్వరూపము; పైన్ = మీద; వఱలిన = ప్రవర్తిల్లు; భక్తి = భక్తి; యుక్తులు = కూడినవారు; అగు = అయిన; వారల = వారి; సంగతిన్ = సహవాసమును; కల్గన్ = కలుగునట్లు; చేయు = చేయుము; సత్ = మంచి; పురుష = పురుషుల; సు = మంచి; సంగతిన్ = సహవాసముననను; వ్యసన = దోషము అనెడి {వ్యసనము – కామక్రోధముల వలన పుట్టిన దోషము}; దుస్తర = దాటరాని; సాగరమున్ = సముద్రమును; అప్రయత్నన్ = అప్రయత్నముగ; సరస = మనోహరమైన; భవత్ = నీ యొక్క; కథా = కథ అనెడి; అమృతంబునన్ = అమృతముచేత; మత్తుడను = మత్తెక్కినవాడను; ఐ = అయ్యి; తరించెదన్ = దాటెదను.

భావము:- శ్రీహరీ! నిర్మలాత్ములై నీ సేవయందు ఆసక్తులైన భక్తులతో నాకు మైత్రి చేకూర్చు. ఆ సత్పురుషుల సాంగత్యం చేత నీ కథాసుధారసాన్ని మనసారా గ్రోలి, దుఃఖాలతో నిండిన దాటరాని సంసార సాగరాన్ని సులభంగా తరిస్తాను.

4-285-చ.

**నిరతముఁ దావకీన భజనీయ పదాబ్జ సుగంధలబ్ధి నె**
**వ్వరి మది వొందఁగాఁ గలుగు, వారలు తత్ప్రియ మర్త్యదేహముం**
**గరము తదీయ దార సుత కామ సుహృద్గృహ బంధు వర్గమున్**
**మఱతురు విశ్వతోముఖ! రమాహృదయేశ! ముకుంద! మాధవా!**

టీక:- నిరతమున్ = ఎల్లప్పుడు; తావకీన = నీ యొక్క; భజనీయ = పూజించదగిన; పద = పాదములు అనెడి; అబ్జ = పద్మముల; సుగంధ = సువాసనలు; లబ్ధిన్ = దొరకుటను;

ఎవ్వరి = ఎవరి; మదిన్ = మనసు; పొందగాన్ = పొందుటను; కలుగు = సాధించ కలిగిన; వారలు = వారు; తత్ = వారి; ప్రియ = ప్రియమగు; మర్త్య = మానవ; దేహమున్ = శరీరమును; కరము = మిక్కిలి; తదీయ = అతని; దార = భార్య; సుత = బిడ్డలు; కామ = హితులు; సుహృత్ = స్నేహితులు; గృహ = గృహములు; బంధు = బంధువుల; వర్గమున్ = సమూహమును; మఱతురు = మరచిపోతారు; విశ్వతోముఖ = హరి {విశ్వతోముఖుడు – విశ్వమంతయు వ్యాపించిన వాడు, విష్ణువు}; రమాహృదయేశ = హరి {రమా హృదయేశ – రమ (లక్ష్మీదేవి) హృదయమునకు ప్రభువు, విష్ణువు}; ముకుంద = హరి; మాధవా = హరి.

భావము:- విశ్వతోముఖా! రమామనోహరా! ముకుందా! మాధవా! నీ పాదపద్మాల సుగంధాన్ని అనుభవించిన వారు మరణ శీలమైన శరీరాన్ని లెక్కచేయరు. భార్యాపుత్రులను, మిత్రులను, భవనాలను, బంధువులను మరచిపోతారు.

4-286-సీ.

**పరమాత్మ! మర్త్య సుపర్వ తిర్యఙ్మృగ-**
**దితిజ సరీసృప ద్విజగణాది**
**సంవ్యాప్తమును సదసద్విశేషంబును-**
**గైకొని మహదాది కారణంబు**
**నైన విరాడ్విగ్రహంబు నే నెఱుఁగుదుఁ-**
**గాని తక్కిన సుమంగళమునైన**
**సంతత సుమహితైశ్వర్య రూపంబును-**
**భూరిశబ్దాది వ్యాపార శూన్య**

4-286.1-తే.

**మైన బ్రహ్మస్వరూప మే నాత్మ నెఱుఁగఁ**
**బ్రవిమలాకార! సంసారభయవిదూర!**
**పరమమునిగేయ! సంతతభాగధేయ!**
**నళిననేత్ర! రమాలలనాకళత్ర!**

టీక:- పరమాత్మ = హరి {పరమాత్మ – అతీతమైన ఆత్మకలవాడు, విష్ణువు}; మర్త్య = మానవ; సుపర్వ = దేవతల; తిర్యక్ = అడ్డముగపోవునట్టి జంతువులు; మృగ = వేట జంతువులు; దితిజ = రాక్షసులు; సరీసృప = పాకెడి జంతువులు; ద్విజ = పక్షులు; గణ = సమూహములు; ఆది = మొదలైనవాటిలో; సంవ్యాప్తమును = చక్కగ వ్యాపించినది; సత్ = మంచివి; అసత్ = చెడ్డవి; విశేషంబును = విశిష్టమైనవి; కైకొని = పూని; మహదాది = మహదాదులు; కారణంబును = కారణముగ కలది; ఐన = అయిన; విరాడ్విగ్రహంబున్ = విరాడ్రూపమును; నేన్ = నేను; ఎఱుంగుదున్ = తెలియుదును; కాని = కాని; తక్కిన = దీనికి అతీతమైన; సు = మిక్కిలి; మంగళము = శుభకరము; ఐన = అయిన; సంతత = నిరంతర;

సుమహిత = మిక్కిలి గొప్పదైన; ఐశ్వర్య = మహిమలతో కూడినట్టి; రూపంబును = రూపమును; భూరి = అత్యధికమైన; శబ్దాది = శబ్దము మొదలగు {శబ్దాది - 1శబ్దము 2స్పర్శము 3రూపము 4రుచి 5 వాసన}; వ్యాపార = వ్యాపారముల; శూన్యము= లేనిది; ఐన= అయిన.

బ్రహ్మ = బ్రహ్మము అనెడి; స్వరూపమున్ = స్వరూపమును; నేన్ = నేను; ఎఱుగన్ = ఎరగను; ప్రవిమాలాకార = హరి {ప్రవిమాలాకార - మిక్కిలి నిర్మలమైన ఆకారము కలవాడు, విష్ణువు}; సంసారభయవిదూర = హరి {సంసారభయవిదూర - సంసారము ఎడలి భయమును దూరము చేయువాడు, విష్ణువు}; పరమమునిగేయ = హరి {పరమముని గేయుడు - అత్యుత్తమైన మునులచే కీర్తింపబడువాడు, విష్ణువు}; సంతత భాగధేయ = హరి {సంతతభాగధేయుడు - ఎడతెగని కర్మఫలముల రూపమైన వాడు, విష్ణువు}; నళిన నేత్ర = హరి {నళిననేత్రుడు - పద్మములవంటి కన్నులు కలవాడు, విష్ణువు}; రమాలలనా కళత్ర = హరి {రమాలలనాకళత్రుడు - లక్ష్మీదేవిని భర్యగా కలవాడు, విష్ణువు}.

భావము:- పరమాత్మా! మానవులు, దేవతలు, మృగాలు, రాక్షసులు, పాములు, పక్షులు మొదలైన పలువిధాల ప్రాణులతో నిండి ప్రకృతి పురుషులతో కూడి మహదాదులకు కారణమైన నీ స్థూల రూపాన్ని నేను ఎరుగుదును. కాని నిత్యకల్యాణమూ, నిరంతర మహైశ్వర్య సంపన్నమూ అయి, శబ్ద వ్యాపారానికి గోచరం కాని నీ పరబ్రహ్మ స్వరూపాన్ని మాత్రం నేను ఎరుగను. రాజీవనేత్రా! రమాకళత్రా! నీవు నిర్మలాకారుడవు. భవభయదూరుడవు. మునిజన సంస్తవనీయుడవు. పరమ భాగ్యధౌరేయుడవు.

4-287-సీ.

సర్వేశ! కల్పాంత సమయంబు నందు నీ-
యఖిల ప్రపంచంబు నాహరించి
యనయంబు శేషసహాయుండవై శేష-
పర్యంక తలమునఁ బవ్వళించి
యోగనిద్రా రతి నుండి నాభీసింధు-
జస్వర్ణలోక కంజాత గర్భ
మందుఁ జతుర్ముఖు నమరఁ బుట్టించుచు-
రుచి నొప్పు బ్రహ్మస్వరూపి వైన

4-287.1-తే.

నీకు మ్రొక్కెద నత్యంత నియమ మొప్ప
భవ్యచారిత్ర! పంకజపత్రనేత్ర!
చిరశుభాకార! నిత్యలక్ష్మీవిహార!
యవ్యయానంద! గోవింద! హరి! ముకుంద!

టీక:- సర్వేశ = హరి; కల్పాంత = ప్రళయ; సమయంబున్ = కాలము; అందున్ = లో; ఈ = ఈ; అఖిల = సమస్తమైన; ప్రపంచంబున్ = ప్రపంచమును; ఆహరించి = మింగి; అనయంబున్ = అవశ్యము; శేష = శేషుని; సహాయుండవు = సహాయము కలవాడవు; ఐ = అయ్యి; శేష = శేషుడు అనెడి; పర్యంకతలమునన్ = శయ్యాతల్పముపై; పవ్వళించి = పండుకొని; యోగనిద్రా = యోగనిద్రయందు; రతిన్ = కుతూహలమున; ఉండి = ఉండి; నాభీ = బొడ్డు అనెడి; సింధు = సముద్రమును; జ = పుట్టిన; స్వర్ణ = బంగారు; లోక = విశ్వ; కంజాత = పద్మము యొక్క; గర్భము = గర్భము; అందున్ = లో; చతుర్ముఖున్ = చతుర్ముఖబ్రహ్మను; అమరన్ = చక్కగ; పుట్టించుచున్ = సృష్టిస్తూ; రుచిన్ = ప్రకాశముతో; ఒప్పు = చక్కగ ఉండెడి; బ్రహ్మ = పరబ్రహ్మ యొక్క; స్వరూపివి = స్వరూపముగ కలవాడవు; ఐన = అయిన.

నీకున్ = నీకు; మ్రొక్కెదన్ = నమస్కరించెదను; అత్యంత = మిక్కిలి; నియమము = నియమము; ఒప్పన్ = ఒప్పునట్లు; భవ్యచారిత్ర = హరి; పంకజపత్రనేత్ర = హరి; చిరశుభాకార = హరి; నిత్యలక్ష్మీవిహార = హరి; అవ్యయానంద = హరి; గోవింద = హరి; హరి = హరి; ముకుంద = హరి.

భావము:- సర్వేశ్వరా! భవ్యచరిత్రా! కమలదళనయనా! శాశ్వత శుభాకారా! లక్ష్మీవిహారా! అవ్యయానందా! గోవిందా! హరీ! ముకుందా! నీవు కల్పాంత కాలంలో సర్వప్రపంచాన్ని నీలో విలీనం చేసుకుంటావు. ఆదిశేష తల్పంమీద శయనిస్తావు. యోగనిద్ర పొందుతావు. అప్పుడు నీ నాభి అనే సముద్రంలోనుండి పుట్టిన బంగారు తామరపువ్వులోనుండి చతుర్ముఖ బ్రహ్మను సృష్టిస్తావు. అటువంటి తేజోమయమైన నీ పరబ్రహ్మ స్వరూపానికి నిశ్చల నియమంతో నమస్కరిస్తున్నాను.

4-288-వ.

**అట్లు యోగనిద్రా పరవశుండ వయ్యును జీవులకంటె నత్యంత విలక్షణుండవై యుండుదు; వది యెట్లనిన బుద్ధ్యవస్థాభేదంబున నఖండితం బయిన స్వశక్తిం జేసి చూచు లోకపాలన నిమిత్తంబు యజ్ఞాధిష్ఠాతవు గావున నీవు నిత్యముక్తుండవును, బరిశుద్ధుం డవును, సర్వజ్ఞుండవును, నాత్మవును, గూటస్థుండవును, నాదిపురు షుండవును, భగవంతుండవును, గుణత్రయాధీశ్వరుండవును నై వర్తింతువు; భాగ్యహీనుండైన జీవునియందు నీగుణంబులు గలుగవు; ఏ సర్వేశ్వరునందేమి విరుద్ధగతులై వివిధ శక్తియుక్తంబులైన యవి ద్యాదు లానుపూర్వ్యంబునం జేసి ప్రలీనంబు లగుచుం; డట్టి విశ్వకార ణంబు నేకంబు ననంతంబు నాద్యంబు నానందమాత్రంబు నవికా రంబు నగు బ్రహ్మంబునకు నమస్కరించెద; మఱియు దేవా! నీవ సర్వ**

విధఫలం బని చింతించు నిష్కాము లయినవారికి రాజ్యాదికామితం బులలోనఁ బరమార్థం బయిన ఫలంబు సర్వార్థరూపుండవైన భవదీయ పాద పద్మ సేవనంబ; నిట్లు నిశ్చితంబ యైనను సకాము లయిన దీనులను గోవు వత్సంబును స్తన్యపానంబు చేయించుచు, వృకాది భయంబు వలన రక్షించు చందంబునం గామప్రదుండవై సంసార భయంబు వలన బాపుదు;" వని యిట్లు సత్యసంకల్పుం డును, సుజ్ఞానియు నయిన ధ్రువునిచేత వినుతింపంబడి భృత్యాను రక్తుం డైన భగవంతుండు సంతుష్టాంతరంగుండై యిట్లనియె.

టీక:- అట్లు = ఆ విధముగ; యోగనిద్రా = యోగనిద్ర యందు; పరవశుండవు = మైమరచి ఉన్నవాడవు; అయ్యును = అయినప్పటికిని; జీవుల = జీవులు; కంటెన్ = కంటెను; అత్యంత = మిక్కిలి; విలక్షణుండవు = వేరైన లక్షణములు కలవాడవు; ఐ = అయ్యి; ఉండుదువు = ఉంటావు; అది = అది; ఎట్లు = ఏ విధముగ; అనినన్ = అనగా; బుద్ధి = బుద్ధి యొక్క; అవస్థా = అవస్థలలోని; భేదంబునన్ = భేదము వలన; అఖండితంబు = ఎడతెగనిది; ఐన = అయిన; స్వ = స్వంత; శక్తిన్ = శక్తి; చేసి = వలన; చూచు = చూచెడి; లోక = లోకములను; పాలన = పాలించెడి; నిమిత్తంబున్ = కొరకు; యజ్ఞ = యజ్ఞమునకు; అధి ష్ఠాతవు = అధిపతిస్థానము వహించినవాడవు; కావునన్ = కనుక; నీవు = నీవు; నిత్య = శాశ్వతముగ; ముక్తుండవును = ముక్తికలవాడవు; పరిశుద్ధుండవును = మిక్కిలి శుద్ధమైన వాడవు; సర్వజ్ఞుండవును = సర్వమును తెలిసినవాడవు; ఆత్మవు = ఆత్మవు; కూటస్థుండవును= దేహములందుండువాడవు; ఆదిపురుషుండవును= ఆదిపురుషుడవు; భగవంతుడవును = మహామహిమాన్వితుడవు; గుణత్రయాధీశ్వరుండవును = త్రిగుణములకు అధిపతివి; ఐ = అయ్యి; వర్తింతువు = ప్రవర్తింతువు; భాగ్యహీనుండు = భాగ్యహీనుడు; ఐన = అయిన; జీవుని = జీవుని; అందున్ = లో; ఈ = ఈ; గుణంబులు = లక్షణములు; కలుగవు = ఉండవు; ఏ = ఏ; సర్వేశ్వరున్ = భగవంతుని; అందేమి = అందులోనైతే; విరుద్ధ = వ్యతిరిక్త; గతులు = గమనములు కలవి; ఐ = అయ్యి; వివిధ = రకరకముల; శక్తిన్ = సామర్థ్యములు; యుక్తంబుల్ = కూడినవి; ఐన = అయిన; అవిద్యా = అవిద్య; ఆదులు = మొదలైనవి; అనుపూర్వ్యంబు = క్రమబద్ధము; చేసి = అనుసరించి; ప్రలీనంబులున్ = లయ ములు; అగుచుండు = అవుతుండును; అట్టి = అటువంటి; విశ్వ = విశ్వము పుట్టుటకు; కారణంబును = కారణమును; అనంతంబును = అంతములేనిది; ఆద్యంబున్ = సృష్టికి ఆది అయినది; ఆనందమాత్రంబున్ = ఆనందము ఒక్కటే ఐనది; అవికారంబున్ = మార్పులు లేనిది; అగు = అయిన; బ్రహ్మంబున్ = బ్రహ్మమున; కున్ = కు; నమస్కరించెదన్ = నమస్కరించెదను; మఱియు = ఇంకను; దేవా = దేవుడ; నీవ = నీవె; సర్వవిధ = అన్నిరకముల; ఫలంబున్ = ఫలితములును; అని = అని; చింతించు = ధ్యానించెడి; నిష్కాములు = కోరికలు లేనివారు; అయిన = అయిన; వారి = వారి; కిన్ = కి; రాజ్య = రాజ్యము; ఆది = మొదలగు; కామితంబుల =

కోరదగినవాటి; లోనన్ = లో; పరమ = అత్యుత్తమ; అర్థంబున్ = ప్రయోజనములు; అయిన = అయిన; ఫలంబున్ = ఫలితము; సర్వ = సమస్తమైన; అర్థ = ప్రయోజనంబుల; రూపుండవు = స్వరూపము యైనవాడవు; ఐన = అయిన; భవదీయ = నీ యొక్క; పాద = పాదములు అనెడి; పద్మ = పద్మముల; సేవనంబ = భజియించుటయె; ఇట్లు= ఇలా; నిశ్చితంబ = నిశ్చయింపబడినదే; ఐనను = అయినప్పటికిని; సకాములు = కోరికలుకల వారు; అయిన = అయిన; దీనులను = దీనులను; గోవు = ఆవు; వత్సంబును = దూడను; స్తన్య = పాలు; పానంబున్ = తాగించుట; చేయించుచు = చేయిస్తూ; వృక = తోడేలు; ఆది = మొదలగు వాటి; భయంబున్ = భయము; వలన = నుండి; రక్షించు = కాపాడెడి; చందం బునన్ = వలె; కామ = కోరినవి; ప్రదుండవు = ఇచ్చు వాడవు; ఐ = అయ్యి; సంసార = సంసార మందలి; భయంబున్ = భయము; వలనను = నుండి; పాపుదువు = పోగొట్టెదవు; అని = అని; ఇట్లు = ఈ విధముగ; సత్యసంకల్పుండును = గట్టి సంకల్పము కలవాడు; సుజ్ఞానియు = మంచి జ్ఞానము కలవాడు; అయిన = అయిన; ధ్రువుని = ధ్రువుని; చేతన్ = చేత; వినుతింపంబడి = స్తుతింపబడి; భృత్యు = సేవకుని ఎడల; అనురక్తుండు = ప్రీతి కలవాడు; ఐన = అయిన; భగవంతుండు = హరి; సంతుష్ట = సంతుష్టి చెందిన; అంతరం గుండు = హృదయము కలవాడు; ఐ = అయ్యి; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఆ విధంగా యోగనిద్రలో మైమరచి ఉన్నప్పటికీ నీవు జీవుల కంటె మిక్కిలి విలక్షణంగా ఉంటావు. అవస్థా భేదాన్ని పొందిన బుద్ధితో, చెక్కు చెదరని దృష్టితో జగత్తును రక్షించటానికి విష్ణురూపాన్ని గైకొంటావు. నీవు నిత్యముక్తుడవు; పరిశుద్ధుడవు; సర్వజ్ఞుడవు; ఆత్మవు; కూటస్థుడవు; ఆదిపురుషుడవు; భగవంతుడవు; మూడు గుణాలకు అధిపతివి. జీవుడు భాగ్యహీనుడు. అతనియందు నీ గుణాలు ఉండవు. ఏ సర్వేశ్వరుని యందైతే విరుద్ధగమనం కలిగి వివిధ శక్తులతో కూడిన అవిద్యాదులు ఒకదాని వెంట ఒకటి విలీనం అవుతాయో, అటువంటి జగత్కారణమూ, అద్వితీయమూ, అనంతమూ, ఆద్యమూ, ఆనందమాత్రమూ, అవికారమూ అయిన పరబ్రహ్మవు నీవు. నీకు నమస్కారం. దేవా! నిష్కాములైనవారు నిన్నే సర్వతోముఖ ఫలంగా భావిస్తారు. వారికి రాజ్యం మొదలైన వాంఛలలో పరమార్థమైన ఫలం సర్వాంతర్యామివైన నీ పవిత్ర పాదసేవనమే. ఇది నిశ్చయం. అయినప్పటికీ ఆవు తన దూడకు చన్నిస్తూ తోడేళ్ళు మొదలైన క్రూర మృగాల బారినుండి రక్షించే విధంగా సకాములైనవారి కోరికలను తీరుస్తూనే సంసార భయాలను తొలగిస్తా" వని ఈవిధంగా సత్సంకల్పుడు, సుజ్ఞాని ఐన ధ్రువుడు శ్రీహరిని స్తుతించాడు. అప్పుడు భృత్యులపై అత్యంత ప్రేమగల భగవంతుడు మనస్సులో తృప్తిపడి ఇలా అన్నాడు.

4-289-క.

"ధీరవ్రత! రాజన్య కు
మారక! నీ హృదయమందు మసలిన కార్యం
బారూఢిగా నెఱుంగుదు
నారయ నది వొందరాని దైనను నిత్తున్.

టీక:- ధీరవ్రత = బుద్ధిబలము దీక్షగా కలవాడ; రాజన్య = రాజోత్తముని; కుమారక = కుమారుడ; నీ = నీ; హృదయము = మనసు; అందున్ = లో; మసలిన = కదులుతున్న; కార్యంబున్ = కోరికను; ఆరూఢిగ = నిశ్చయముగ; నేన్ = నేను; ఎఱుంగుదున్ = తెలియుదును; ఆరయ = పరికించి చూసిన; అది = అది; పొందరానిది = పొందలేనిది; ఐనను = అయినప్పటికిని; ఇత్తును = ఇచ్చెదను.

భావము:- “అచంచల దీక్షావ్రతా! రాకుమారా! నీ మనస్సులోని అభిప్రాయాలను చక్కగా గ్రహించాను. అయితే అది దుర్లభమైనది. అయినప్పటికీ నీ కోరిక తీరుస్తాను.

4-290-వ.

**అది యెట్టి దనిన నెందేని మేధియందుఁ బరిభ్రామ్యమాణ గోచక్రం బునుం బోలె గ్రహనక్ష త్రతారాగణ జ్యోతిశ్చక్రంబు నక్షత్ర రూపంబు లయిన ధర్మాగ్ని కశ్యప శక్రులును సప్తర్షులును, దారకా సమేతులై ప్రదక్షిణంబు దిరుగుచుండుదు; రట్టి దురాపంబును ననన్యాధిష్ఠితం బును లోకత్రయ ప్రళయకాలంబునందు నశ్వరంబుగాక ప్రకాశ మానంబును నయిన ధ్రువక్షితి యను పదంబు ముందట నిరువది యాఱువేలేండ్లుచనం బ్రాపింతువు; తత్పద ప్రాప్తిపర్యంతంబు భవ దీయ జనకుండు వనవాస గతుండైనం దద్రాజ్యంబు పూజ్యంబుగా ధర్మమార్గంబున జితేంద్రియుండవై చేయుదువు; భవదనుజుం డగు నుత్తముండు మృగయార్థంబు వనంబునకుం జని మృతుం డగు; తదన్వేషణార్థంబు తదాహిత చిత్త యై తన్మాతయు వనంబునకుం జని యందు దావదహన నిమగ్న యగు; వెండియు.**

టీక:- అది = అది; ఎట్టిది = ఎటువంటిది; అనిన్ = అనినచో; ఎందేని = ఎక్కడైతే; మేధి = కట్రాట {మేధి – ధాన్యము నూర్చునప్పుడు ఎడ్లను తిప్పుటకు నడుమ పాతెడి రాట, కట్రాట}; అందున్ = అందు; పరిభ్రామ్యమాణ = చుట్టును తిరుగుచున్న; గో = పశువు చేయు; చక్రంబునున్ = చక్రము; పోలెన్ = వలె; గ్రహ = గ్రహములు; నక్షత్ర = నక్షత్రములు; తారా = తారల; గణ = సమూహము; జ్యోతిశ్చక్రంబున్ = జ్యోతిశ్చక్రము; నక్షత్ర = నక్షత్ర ముల; రూపంబులు = రూపములు; అయిన = అయిన; ధర్మ = ధర్ముడు; అగ్ని = అగ్ని; కశ్యప = కశ్యపుడు; శక్రులును = ఇంద్రుడును; సప్తర్షులును = ఏడుగురు ఋషులు; తారకా = తారకల; సమేతులు = కూడినవారు; ఐ = అయ్యి; ప్రదక్షిణంబున్ = ప్రదక్షిణ రూపముగ; తిరుగుచున్ = తిరుగుతూ; ఉండుదురు = ఉంటారు; అట్టి = అటువంటి; దురాపంబును = చేరుటకు శక్యము కానిది; అనన్యాధిష్టితంబును = ఇంకొకరిచే ఆక్రమింపబడనిది; లోక త్రయ = ముల్లోకముల {లోకత్రయము– భూః భువః సువః లోకములు}; ప్రళయ = విలయ;

కాలంబున్ = సమయము; అందున్ = లోను; నశ్వరంబు = నశించుట; కాక = కాకుండగ; ప్రకాశమానంబు = ప్రకాశవంతము; అయిన = అయిన; ధ్రువక్షితి = ధ్రువపదము; అను = అనెడి; పదంబున్ = పదమును; ముందటన్ = రాబోవుకాలమున; ఇరువదియాఱువేల = ఇరవైయారువేల (26000); ఏండ్లు = సంవత్సరములు; చనన్ = గడిచిన తరువాత; ప్రాపింతువు = పొందుదువు; తత్ = ఆ; పద = పదము; ప్రాప్తి = పొందెడి; పర్యంతంబున్ = వరకు; భవదీయ = నీ యొక్క; జనకుండు = తండ్రి; వనవాస = వనవాసమునకు; గతుండు = వెళ్ళినవాడు; ఐనన్ = అయిన; తత్ = ఆ; రాజ్యంబున్ = రాజ్యమును; పూజ్యంబుగా = పూజనీయంబుగా; ధర్మ = ధర్మబద్ధమైన; మార్గంబునన్ = విధముగ; జిత = జయించిన; ఇంద్రియుండవు = ఇంద్రియములు కలవాడు; ఐ = అయ్యి; చేయుదువు = చేసెదవు; భవత్ = నీ యొక్క; అనుజుండు = సోదరుడు; అగున్ = అయిన; ఉత్తముండు = ఉత్తముడు; మృగయా = వేట; అర్థంబున్ = నిమిత్తంబున; వనంబున్ = అడవి; కున్ = కి; చని = వెళ్ళి; మృతుండు = మరణించినవాడు; అగున్ = అగును; తత్ = అతని; అన్వేషణా = వేదకెడి; అర్థంబునన్ = కోసము; తత్ = అతని యందు; ఆహిత = నిలిపిన; చిత్త = మనసు కలామె; ఐ = అయ్యి; తత్ = అతని; మాతయు = తల్లికూడ; వనంబున్ = అడవి; కున్ = కి; చని = వెళ్ళి; అందున్ = అందు; దావ = దావాగ్ని యందు; దహన = మంటలలో; నిమగ్న = పడినది; అగున్ = అగును; వెడియు = ఇంక.

భావము:- కట్టుకొయ్య చుట్టూ పశువుల మంద తిరిగినట్లుగా గ్రహాలు, నక్షత్రాలు, తారాగణాలు, జ్యోతిశ్చక్రం, నక్షత్ర స్వరూపాలైన ధర్ముడు, అగ్ని, కశ్యపుడు, శుక్రుడు, సప్తర్షులు, తారకలతో కూడి దేనికి ప్రదక్షిణం చేస్తారో అటువంటి ధ్రువక్షితి అనే మహోన్నత స్థానాన్ని ఇకపైన ఇరవైఆరువేల సంవత్సరాల తరువాత నీవు పొందుతావు. అది ఎవ్వరికీ అందరానిది. ఇదివరకు ఎవ్వరూ దానిని పొందలేదు. ముల్లోకాలు నశించేటప్పుడు కూడా అది నశించకుండా ప్రకాశిస్తూ ఉంటుంది. అటువంటి స్థానాన్ని నీవు అలంకరిస్తావు. అంతవరకు నీ తండ్రి రాజ్యాన్ని నీవు సర్వజన రంజకంగా ధర్మమార్గాన పరిపాలిస్తావు. ఇంద్రియాలను జయిస్తావు. నీ తండ్రి అడవికి పోయి వానప్రస్థాశ్రమం స్వీకరిస్తాడు. నీ తమ్ముడైన ఉత్తముడు వేటకై అడవికి వెళ్ళి మరణిస్తాడు. అతనిని వెదుకుతూ అతనియందే మనస్సు చేర్చిన అతని తల్లి అరణ్యంలో ప్రవేశిస్తుంది. ఆమె అడవిలో కార్చిచ్చులో పడి కాలిపోతుంది.

4-291-సీ.

**అనఘాత్మ! మఱి నీవు యజ్ఞరూపుం డనఁ-**
**దగు నన్ను సంపూర్ణ దక్షిణంబు**
**లగు మఖంబులచేత నర్చించి సత్యంబు-**
**లగు నిహసౌఖ్యంబు లనుభవించి**

యంత్యకాలమున నన్నాత్మఁ దలంచుచు-
మఱి సర్వలోక నమస్కృతమును
మహిఁ బునరావృత్తి రహితంబు సప్తర్షి-
మండలోన్నత మగు మామకీన

4-291.1-తే.

పదము దగఁ బొందఁగల"వని పరమపురుషుఁ
డతని యభిలషితార్థంబు లర్థి నిచ్చి
యతఁడు గనుఁగొను చుండంగ నాత్మపురికి
గరుడగమనుఁడు వేంచేసెఁ గౌతుకమున.

టీక:- అనఘాత్మ = పుణ్యాత్మ; మఱి = మరి; నీవు = నీవు; యజ్ఞ = యజ్ఞము; రూపుండు = స్వరూపముగాకలవాడు; అనన్ = అనుటకు; తగు = తగిన; నన్ను = నన్ను; సంపూర్ణ = పూర్తి; దక్షిణంబులు = దక్షిణలుకలిగినవి; అగున్ = అయిన; మఖంబులన్ = యజ్ఞముల; చేతన్ = చేత; అర్చించి = పూజించి; సత్యంబులు = సత్యమైనవి; అగు = అయిన; ఇహ = ఈలోకపు; సౌఖ్యంబులన్ = సౌఖ్యములను; అనుభవించి = అనుభవించి; అంత్య = మరణ; కాలంబునన్ = సమయములో; నన్ = నన్ను; ఆత్మన్ = మనసులో; తలచుచున్ = ధ్యానము చేస్తూ; మఱి = మరి; సర్వ = అన్ని; లోక = లోకములచేతను; నమస్కృతమును = నమస్కరింపబడునది; మహిన్ = భూమిపై; పునరావృత్తి = మరల వచ్చుట, జననమరణములు; రహితంబును = లేనిది; సప్తర్షి = ఏడుగురు ఋషులు; మండల = పదమునకు; ఉన్నతము = పైనది; అగు = అయిన; మామకీన = నా యొక్క. పదమున్ = స్థానము; పొందగలవు = పొందగలవు; అని = అని; పరమపురుషుడు = విష్ణువు; అతని = అతని; అభిలషితార్థంబులు = కోరిన ప్రయోజనములు; అర్థిన్ = కోరి; ఇచ్చి = ఇచ్చి; అతడు = అతడు; కనుగొనుచుండన్ = చూస్తుండగ; ఆత్మ = స్వంత; పురికి = నగరికి; గరుడగమనుడు = విష్ణువు {గరుడగమనుడు - గరుడవాహనము పై తిరుగు వాడు, విష్ణువు}; వేంచేసె = వెళ్ళను; కౌతుకము = కుతూహలము; ఒప్పన్ = ఒప్పునట్లుగ.

భావము:- పుణ్యాత్మా! నీవు యజ్ఞపురుషుడనైన నన్ను సంపూర్ణ దక్షిణలతో కూడిన యజ్ఞాలచేత ఆరాధిస్తావు. ఈ లోకంలోని అనంత సౌఖ్యాలను అనుభవిస్తావు. మరణ కాలంలో నన్ను మనస్సులో స్మరిస్తూ, సకల లోకాలకు వందనీయమై, పునరావృత్తి రహితమై సప్తర్షిమండలం పైన ఉండే నా స్థానాన్ని పొందుతావు." అని భగవంతుడు ధ్రువుడు కోరిన కోరికలను ప్రసాదించి, అతడు చూస్తూ ఉండగానే గరుత్మంతుణ్ణి అధిరోహించి ఆనందంగా తన పట్టణమైన వైకుంఠమునకు వేంచేసాడు.

4-292-తే.

అంత ధ్రువుఁడునుఁ బంకేరుహాక్ష పాద
కమల సేవోపపాదిత ఘన మనోర
థములఁ దనరియుఁ దనదు చిత్తంబులోనఁ
దుష్టిఁ బొందక చనియె విశిష్టచరిత!"

టీక:- అంత = అంతట; ధ్రువుడును = ధ్రువుడు; పంకేరుహాక్ష = హరి {పంకేరుహాక్షుడు - పంకేరుహము (నీటిలో పుట్టునది, పద్మము) వంటి కన్నులు కలవాడు, విష్ణువు}; పాద = పాదములు అనెడి; కమల = పద్మముల; సేవా = సేవించుటవలన; ఉపాదిత = పొందిన; ఘన = గొప్ప; మనోరథములన్ = కోరికలందు; తనరియున్ = అతిశయించియును; తనదు = తన యొక్క; చిత్తంబు = మనసు; లోనన్ = లో; తుష్టి = తృప్తి; పొందక = పొందలేక; చనియె = పోయెను; విశిష్టచరిత = అతిశ్రేష్ఠమైన వర్తన కలవాడ.

భావము:- అప్పుడు ధ్రువుడు పద్మాక్షుడైన విష్ణువు యొక్క పాదపద్మాలను సేవించడం వల్ల సమధిక మనోరథాలు సంప్రాప్తించినప్పటికీ, సంతృప్తి పొందక చింతిస్తూ వెళ్ళిపోయాడు.

4-293-క.

అని మైత్రేయుఁడు ధ్రువుఁ డ
ట్లనయము హరిచేఁ గృతార్థుఁడైన విధం బె
ల్లను వినిపించిన విదురుఁడు
విని మునివరుఁ జూచి పలికె వినయం బెసఁగన్.

టీక:- అని = అని; మైత్రేయుడు = మైత్రేయుడు; ధ్రువుడు = ధ్రువుడు; అట్లు = ఆ విధముగ; అనయము = పూర్తిగ; హరి = విష్ణువు; చేన్ = చేత; కృతార్థుడు = కోరినది పొందినవాడు; ఐన = అయిన; విధంబున్ = విధము; ఎల్లను = అంతయు; వినిపించిన = చెప్పగా; విదురుడు = విదురుడు; విని = విని; ముని = మునులలో; వరున్ = ఉత్తముని; చూచి = చూసి; పలికెన్ = పలికెను; వినయంబున్ = వినయము; ఎసగన్ = అతిశయించగ.

భావము:- అని ఈ విధంగా మైత్రేయుడు ధ్రువుడు శ్రీహరినుండి వరాలను పొందిన విధం అంతా విదురునికి వినిపించాడు. విన్న విదురుడు మహర్షితో సవినయంగా ఇలా అన్నాడు.

4-294-క.

"మునినాయక! విను కాముక
జనదుష్ప్రాపంబు విష్ణు చరణాంబురుహా
ర్చన మునిజన సంప్రాప్యము
నన(గల పంకేరుహాక్షు నవ్యయ పదమున్.

టీక:- ముని = మునులకు; నాయక = నాయకుడ; విను = వినుము; కాముక = కోరికలుగల; జన = వారిచే; దుష్ప్రాపంబున్ = పొందరానిది; విష్ణు = హరి; చరణ = పాదములు అనెడి; అంబురుహ = పద్మముల; అర్చన = పూజించెడి; ముని = మునులైన; జన = వారిచే; సంప్రాప్యమున్ = చక్కగ పొందబడునది; అనగల = అనగలిగిన; పంకేరు హాక్షు = విష్ణువు; అవ్యయ = తరుగనట్టి; పదమున్ = స్థానము.

భావము:- "మునీంద్రా! కాముకులకు పొందరానిది, విష్ణు భక్తులైన మునులు మాత్రమే పొందగలిగినది శాశ్వతమైన విష్ణుపదం కదా!

4-295-వ.

పెక్కు జన్మంబులం గాని పొందరాని పదంబు దా నొక్క జన్మంబుననే పొందియుం దన మనంబునం దప్రాప్త మనోరథుండ నని పురుషార్థ వేది యైన ధ్రువుం డెట్లు దలంచె" ననిన మైత్రేయుం డిట్లనియె

టీక:- పెక్కు = అనేకమైన; జన్మంబులన్ = జన్మములకు; కాని = కాని; పొందరాని = పొంద రాని; పదంబున్ = పదమును; తాన్ = తాను; ఒక్క = ఒకటే; జన్మంబునన్ = జన్మములోనే; పొందియున్ = పొందినప్పటికిని; తన = తన యొక్క; మనంబునన్ = మనసులో; అప్రాప్త = పొందని; మనోరథుండను = కోరికలు గలవాడను; అని = అని; పురుషార్థ = పురుషార్థములు {పురుషార్థములు - ధర్మార్థకామమోక్షములు}; వేది = తెలిసినవాడు; ఐన = అయిన; ధ్రువుండు = ధ్రువుడు; ఎట్లు = ఏ విధముగ; తలంచెన్ = భావించెను; అనిన = అనగ; మైత్రేయుడు = మైత్రేయుడు; ఇట్లు = ఈ విధముగ; అనియె = పలికెను.

భావము:- ఎన్నో జన్మలకు కాని పొందరాని విష్ణుపదాన్ని తాను ఒక్క జన్మలోనే పొందికూడా పురుషార్థాలను చక్కగా ఎరిగిన ధ్రువుడు తన కోరిక తీరలేదని ఎందుకు భావించాడు?" అని ప్రశ్నించగా మైత్రేయుడు ఇలా అన్నాడు.

4-296-తే.

"అనఘ! పినతల్లి దన్ను( బల్కిన దురుక్తి
బాణవిద్ధాత్ము( డగుచు( దద్భాషణములు
చిత్తమందు( దలంచుట( జేసి ముక్తి(
గోరమికి నాత్మలో వగ( గూరుచుండె.

టీక:- అనఘ = పుణ్యుడ; ఆ = ఆ; పినతల్లి = పినతల్లి; తన్ను = తనను; పల్కిన = అనిన; దురుక్తి = తిట్లు అనెడి; బాణ = బాణములచే; విద్ధాత్ముడు = గాయ పడ్డ మనసు కల వాడు; అగుచున్ = అవుతూ; తత్ = ఆ; భాషణములు = పలుకులు; చిత్తము = మనసు; అందున్ = లో; తలంచుటన్ = తలచుట; చేసి = వలన; ముక్తిన్ = ముక్తిని; కోరమికిన్ = కోరుకొనకుండుటకు; ఆత్మ = మనసు; లోన్ = లో; వగన్ = విచారములో; కూరుచుండె = కూరుకుపోతుండెను.

భావము:- "పుణ్యాత్మా! పినతల్లి ఆడిన దుర్భాషలు అనే బాణాలచేత ధ్రువుని మనస్సు బాగా గాయపడింది. అందుచేత ఆ దుర్భాషలనే మాటిమాటికి స్మరిస్తూ హరి ప్రత్యక్షమైనపుడు ముక్తిని కోరలేకపోయాడు. అందుకే అతడు మనస్సులో పరితపిస్తున్నాడు.

4-297-వ.

**అంత నా ధ్రువుండు.**

టీక:- అంతన్ = అంతట; ఆ = ఆ; ధ్రువుండు = ధ్రువుడు.

భావము:- అప్పుడు ఆ ధ్రువుడు...

4-298-చ.

**అనఘ! జితేంద్రియుల్ సుమహితాత్ములునైన సనందనాదు లెం**
**దనయ మనేక జన్మ సముపార్జిత యోగ సమాధిఁ జేసి యె**
**వ్వని చరణారవిందములు వారని భక్తి నెఱుంగుచుందు; రా**
**ఘనుఁ బరమేశు నీశు నవికారు నమేయు నజేయు నాద్యునిన్.**

టీక:- అనఘ = పుణ్యుడ; జిత = జయిచిన; ఇంద్రియుల్ = ఇంద్రియములు కలవారు; సు = గొప్ప; మహిత = మహిమ గల; ఆత్ములున్ = వారు; ఐనన్ = అయినప్పటికిని; సనందన = సనందనుడు; ఆదులు = మొదలగువారు; ఎంత = ఎంతో; అనయము = అతిశయించి; అనేక = అనేకమైన; జన్మ = జన్మముల; సమ = గొప్పగ; ఉపార్జిత = కూడబెట్టుకొన్న; యోగసమాధి = యోగసమాధి; చేసి = వలన; ఎవ్వని = ఎవని యొక్క; చరణ = పాదములు అనెడి; అరవిందములు = పద్మములు; వారని = హద్దులేని, లోటులేని; భక్తిన్ = భక్తితో; ఎఱుంగుచుందురు = తెలియుచుందురు; ఆ = ఆ; ఘనున్ = హరిని {ఘనుడు – గొప్పవాడు, విష్ణువు}; పరమేశున్ = హరిని {పరమేశు – అత్యున్నత ప్రభువు, విష్ణువు}; ఈశున్ = హరిని {ఈశుడు – ఈశ్వరుడు, విష్ణువు}; అవికారున్ = హరిని {అవికారుడు – వికారములు (మార్పులు) లేనివాడు, విష్ణువు}; అమేయున్ = హరిని {అమేయుడు – మేరలులేనివాడు, విష్ణువు}; అజేయున్ = హరిని {అజేయుడు – జయింపరానివాడు, విష్ణువు}; ఆద్యునిన్ = హరిని {ఆద్యుడు – పురాతనుడు}.

భావము:- "జితేంద్రియులు, మహాత్ములు అయిన సనందుడు మొదలైన మునీంద్రులు మిక్కిలి భక్తితో పెక్కు జన్మల సమాధి యోగం ద్వారా ఏ మహానుభావుని చరణకమలాలను దర్శించ గలుగుతారో అటువంటి ఘనుడు, పరమేశ్వరుడు, అవికారుడు, అమేయుడు, అజేయుడు, ఆద్యుడు అయిన శ్రీహరిని...

4-299-వ.

ఏను షణ్మాసంబులు భజియించి తత్పాదపద్మ చ్ఛాయం బ్రాపించి యు భేదదర్శనుండ నైతి; నక్కటా! యిట్టి భాగ్యహీనుండనైన యేను భవనాశకుండైన యతనిం బొడఁగనియు నశ్వరంబులైన కామ్యంబు లడిగితి; నిట్టి దౌరాత్మ్యం బెందేనిం గలదే? తమ పదంబులకంటె నున్నత పదంబు నొందుదునో యని సహింపంజాలని యీ దేవతల చేత మదీయ మతి గలుషితం బయ్యెం గాక; నాఁడు నారదుం డాడిన మాట తథ్యం బయ్యె; నతని వాక్యంబు లంగీకరింపక యే నసత్తముం డనై స్వప్నావస్థలం బొందినవాఁడు దైవికంబైన మాయంజెంది భిన్న దర్శనుండగు చందంబున నే నద్వితీయుండ నైనను, భ్రాత యను శత్రువుచేఁ బ్రాప్తం బైన దుఃఖంబు నొంది జగదాత్మకుండును, సుప్ర సాదుండును, భవనాశకుండును నైన యీశ్వరు నారాధించి తత్ప్ర సాదంబు బడసియు నాయుర్విహీనుం డైన రోగికిం బ్రయోగించు నౌషధంబుం బోలె నిరర్థకంబులైన, నశ్వరంబులైన, యీ కామితం బులు గోరితి" నని; వెండియు.

టీక:- ఏను = నేను; షట్ = ఆరు (6); మాసంబులు = నెలలు; భజియించి = సేవించి; తత్ = అతని; పాద = పాదములు అనెడి; పద్మ = పద్మముల; ఛాయన్ = నీడను; ప్రాపించియున్ = పొందియు; భేద = భేద; దర్శనుండను = దృష్టి కలవాడను; ఐతిన్ = అయిపోతిని; అక్కటా = అయ్యో; ఇట్టి = ఇటువంటి; భాగ్యహీనుండను = దురదృష్టవంతు డను; ఐన = అయిన; ఏను = నేను; భవ = సంసారమును; నాశకుండు = నశింపజేయు వాడు; ఐన = అయిన; అతనిన్ = అతనిని; పొడగనియున్ = దర్శించియు; నశ్వరంబులు = నశించిపోవునవి; ఐన = అయిన; కామ్యంబులు = కోరికలు; అడిగితిని = అడిగాను; ఇట్టి = ఇటువంటి; దౌరాత్మ్యంబున్ = చెడ్డవాని లక్షణము; ఎందేని = ఎక్కడైనా; కలదే = ఉందా ఏమి; తమ = తమ యొక్క; పదంబుల = స్థానము; కంటెన్ = కంటె; ఉన్నత = పైనున్న; పదంబున్ = స్థానమును; ఒందుదునో = పొందుదునేమో; అని = అని; సహింపజాలని = సహింపలేని; ఈ = ఈ; దేవతల = దేవతల; చేతన్ = చేత; మదీయ = నా యొక్క; మతిన్ = బుద్ధి; కలుషితంబున్ = కలకబారినది; అయ్యెంగాక = అయినది కాబోలు; నాడు = ఆవేళ;

నారదుండు = నారదుడు; ఆడిన = పలికిన; మాట = మాట; తథ్యంబున్ = నిజము; అయ్యెన్ = అయినది; అతనిన్ = అతని యొక్క; వాక్యంబులు = మాటలు; అంగీకరింపక = ఒప్పుకొనక; ఏన్ = నేను; అసత్తముండను = చెడ్డవాడిని; ఐ = అయ్యి; స్వప్న = కలలుకనే; అవస్థలన్ = అవస్థలను; పొందినవాడు = పొందినవాడు; దైవికంబు = దైవికమైనది; ఐన = అయిన; మాయన్ = మాయను; చెంది = చెంది; భిన్న = భేద; దర్శనుండను = దృష్టి కలవాడను; అగు = అయిన; చందంబునన్ = విధముగ; నేన్ = నేను; అద్వితీయుండను = రెండవది లేనివాడను; ఐనను = అయినప్పటికిని; భ్రాత = సోదరుడు; అను = అనెడి; శత్రువు = శత్రువు; చేన్ = వలన; ప్రాప్తంబు = పొందబడినది; ఐన = అయిన; దుఃఖంబున్ = దుఃఖమును; ఒంది = పొంది; జగత్ = విశ్వమును; ఆత్మకుండును = రూపకుడు; సు = గొప్ప; ప్రసాదుండును = వరముల నిచ్చువాడు; భవ = సంసార; నాశకుండును = నశింప జేయువాడు; ఐన = అయిన; ఈశ్వరున్ = భగవంతుని; ఆరాధించియు = పూజించి; తత్ = అతని; ప్రసాదంబున్ = వరప్రసాదము; పడసియు = పొందియు; ఆయుః = ఆయుష్షు; విహీనుండు = లేనివాడు; ఐన = అయిన; రోగి = వ్యాధిగ్రస్తుని; కిన్ = కి; ప్రయోగించు = వేసిన; ఔషధంబుం = మందు; పోలెన్ = వలె; నిరర్థకంబులు = ప్రయోజన శూన్యములు; ఐన = అయిన; నశ్వరంబులు = నశించునట్టివి; ఐన = అయిన; ఈ = ఈ; కామితంబులున్ = కోరికలను; కోరితిని = కోరుకొంటిని; అని = అని; వెండియు = మరల.

భావము:- నేను ఆరునెలలు సేవించి ఆయన పాదపద్మాల నీడలో నిలిచి కూడా భేదదృష్టి కలవాణ్ణి అయ్యాను. నేను దురదృష్టవంతుణ్ణి. సంసారబంధాలను హరించే హరిని దర్శించి కూడా అనిత్యాలైన కోరికలను కోరుకున్నాను. ఇలాంటి దౌర్భాగ్యం ఎక్కడైనా ఉంటుందా? తమ స్థానాలకంటె ఉన్నతమైన స్థానాన్ని నేను పొందుతానేమో అని ఓర్వలేక దేవతలు నా బుద్ధిని కలతపరచి ఉంటారు. ఆనాడు నారదుడు చెప్పిన మాట నిజమయింది. ఆయన మాటలను నేను లెక్క చేయలేదు. నేను అధముణ్ణి. నిద్రించేవాడు కలలో దైవమాయకు చిక్కి తా నొక్కడే అయినా తనకంటె వేరుగా అనేకులను తనయందు చూస్తాడు. అలాగే నేను ఒక్కడినే అయినప్పటికీ తమ్ముడనే శత్రువును కల్పించుకొని దుఃఖం పొందాను. జగత్స్వరూపుడు, దయామయుడు, సంసారవినాశకుడు అయిన హరిని ఆరాధించి, ఆయన అనుగ్రహం పొందికూడ ఆయుస్సు చాలని రోగికి ఔషధం వలె కొరగాని కోరికలను కోరుకున్నాను.

4-300-మ.

"ధనహీనుండు నృపాలుఁ జేరి మిగులన్ ధాటిన్ ఫలీకార మి
మ్మని యర్థించినరీతి ముక్తిఫలదుం డై నట్టి పంకేజలో
చనుఁ డే చాలఁ బ్రసన్నుఁడైన నతనిన్ సాంసారికం బర్థిఁ గో
రిన నావంటి విమూఢమానసులు ధాత్రిం గల్గిరే యెవ్వరున్?"

టీక:- ధనహీనుండు = పేదవాడు; నృపాలున్ = రాజును {నృపాలుడు - నృ (నరులను) పాలించువాడు, రాజు}; చేరి = దగ్గరకు వెళ్ళి; మిగులన్ = మిక్కిలి; ధాటిన్ = ధాటిగా, గట్టిగా; ఫలీకారము = ఊకతో కూడిన నూకలు; ఇమ్ము = ఇమ్ము; అని = అని; అర్థించిన = కోరిన; రీతి = విధముగ; ముక్తిన్ = మోక్షమును; ఫలదుండు = ఫలితమును ఇచ్చువాడు; ఐనట్టి = అయినట్టి; పంకేజలోచనుఁడే = విష్ణుమూర్తే {పంకేజ లోచనుఁడు - పద్మముల వంటి కన్నులుగలవాడు, విష్ణువు}; చాలన్ = మిక్కిలి; ప్రసన్నుడు = ప్రసన్నమైనవాడు; ఐనన్ = అవ్వగా; అతనిన్ = అతనిని; సాంసారికంబు = సంసారమునకు సంబంధించినవి; అర్థిన్ = కావాలని; కోరిన = కోరినట్టి; నా; వంటి; విమూఢ = మిక్కిలి మూర్ఖపు; మానసులు = మనస్సు కలవారు; ధాత్రిన్ = భూమిని; కల్గిరే = ఉన్నారా ఏమి; ఎవ్వరున్ = ఎవరైనను.

భావము:- పేదవాడు రాజును సమీపించి ఊకతో కూడిన నూకలను ఇమ్మని కోరినట్లు మోక్షప్రదాత అయిన కమలాక్షుడు నాకు ప్రసన్నుడైనా అతన్ని నేను సంసారాన్ని అర్థించాను. నావంటి మందబుద్ధులు ఈ లోకంలో ఎవ్వరూ ఉండరు" (అని ధ్రువుడు విచారించాడు).

## ధ్రువుండు మరలివచ్చుట

4-301-సీ.

అని యిట్లు చింతించె"ననుచు నమ్మైత్రేయ-
  ముని విదురునకు నిట్లనియెఁ "దండ్రి!
కమనీయ హరిపాద కమల రజోభి సం-
  స్కృత శరీరులును యాదృచ్ఛికముగ
సంప్రాప్తమగు దాన సంతుష్టచిత్తులై-
  వఱలుచు నుండు మీవంటి వారు
దగ భగవత్పాద దాస్యంబు దక్కంగ-
  నితర పదార్థంబు లెడఁద లందు"

4-301.1-తే.

మఱచియును గోర నొల్లరు మనుచరిత్ర!
తవిలి యిట్లు హరిప్రసాదంబు నొంది
మరలి వచ్చుచునున్న కుమారు వార్తఁ
జారుచే విని యుత్తానచరణుఁ డపుడు.

టీక:- అని = అని; ఇట్లు = ఈ విధముగ; చింతించెన్ = విచారించెను; అనుచున్ = అంటూ; మైత్రేయ = మైత్రేయుడు అనెడి; ముని = ముని; విదురున్ = విదురుని; కున్ = కి; ఇట్లు = ఈవిధముగ; అనియె = పలికెను; తండ్రీ = అయ్యా; కమనీయ = అందమైన; హరి = విష్ణుని; పాద = పాదములు అనెడి; కమల = పద్మముల; రజస్ = ధూళిచేత; అభిసంస్కృత = మిక్కిలి చక్కజేయబడిన; శరీరులనున్ = దేహములు కలవారు; యాదృచ్ఛికముగన్ = తనంతటతను; సంప్రాప్తము = లభించినది; అగు = అయిన; దానన్ = దానితో; సంతుష్ట = సంతృప్తిపడిన; చిత్తులు = మనసులు కలవారు; ఐ = అయ్యి; వఱలుచున్ = తిరుగుతూ; ఉండు = ఉండెడి; మీ = మీ; వంటి = లాంటి; వారు = వారు; తగన్ = తగి; భగవత్ = భగవంతుని; పాద = పాదముల; దాస్యంబున్ = సేవ; తక్కంగ = తప్పించి; ఇతర = ఇతర మైన; పదార్థంబుల = వస్తువులు; ఎడదలు = హృదయముల; అందున్ = లో.

మఱచియునున్ = మరిచిపోయి యైన; కోరన్ = కోరుటను; ఒల్లరు = ఒప్పుకొనరు; మనుచరిత్ర = మనువు వంటి చరిత్రకలవాడ; తవిలి = పూని; ఇట్లు = ఈ విధముగ; హరి = విష్ణుని; ప్రసాదంబున్ = అనుగ్రహమును; ఒంది = పొంది; మరలి = తిరిగి; వచ్చుచునున్న = వస్తున్న; కుమారు = పుత్రుని; వార్త = సమాచారము; చారున్ = వేగుల; చేన్ = వలన; విని = విని; ఉత్తానచరణుడు = ఉత్తానపాదుడు; అపుడు = అప్పుడు.

భావము:- అని ఈ విధంగా ధ్రువుడు విచారించాడు ” అని చెప్పి మైత్రేయుడు విదురునితో ఇలా అన్నాడు “నాయనా! పావనమైన శ్రీహరి పాదపద్మాల పరాగంతో అలంకరింపబడిన శరీరం కలిగిన మీవంటివాళ్ళు తనంత తాను దొరికే దానితోనే సంతృప్తిపడతారు. భగవంతుని పాదసేవను తప్ప మరొకటి కోరుకొనరు. విష్ణుదేవుని అనుగ్రహాన్ని పొంది కన్నకొడుకు తిరిగి వస్తున్నాడన్న వార్తను ఉత్తానపాదుడు చారుల వల్ల విని...

4-302-వ.

**మనమున నిట్లని తలంచె.**

టీక:- మనమునన్ = మనసులో; ఇట్లు = ఈవిధముగ; అని; తలంచె = అనుకొనెను.

భావము:- మనస్సులో ఇలా తలంచాడు.

4-303-క.

**చచ్చిన వారలుఁ గ్రమ్మఱ**
**వచ్చుటయే కాక యిట్టి వార్తలు గలవే?**
**నిచ్చలు నమంగళుఁడ నగు**
**నిచ్చట మఱి నాకు శుభము లేల ఘటించున్.**

టీక:- చచ్చిన = చనిపోయిన; వారలు = వారు; క్రమ్మఱన్ = మరల; వచ్చుటయే = రావటమే; కాక = కాకుండగ; ఇట్టి = ఇటువంటి; వార్తలు = సమాచారములు; కలవే = ఉన్నవా ఏమి; నిచ్చలున్ = నిత్యము; అమంగళుండను = అశుభకరుడను; అగు = అయిన; ఇచ్చటన్ = ఇక్కడ; మఱి = మరి; నా = నా; కున్ = కు; శుభములు = శుభములు; ఏలన్ = ఏవిధముగ; ఘటించున్ = సంభవించును.

భావము:- చచ్చినవారు తిరిగి రావడం అనే చోద్యం ఎక్కడైనా ఉందా? అన్నివిధాల నిర్భాగ్యుడనైన నాకు అంతటి అదృష్టం ఎలా లభిస్తుంది?

4-304-క.

**అని విశ్వసింపకుండియు**
**మనమున నా నారదుఁడు గుమారుఁడు వేగం**
**బునఁ రాఁగలఁ డనుచును బలి**
**కిన పలుకులు దలఁచి నమ్మి కృతకృత్యుండై.**

టీక:- అని = అని; విశ్వసింపకుండియు = నమ్మకపోయినప్పటికిని; మనమునన్ = మనస్సులో; ఆ = ఆ; నారదుడు = నారదుడు; కుమారుడు = సుతుడు; వేగంబునన్ = తొందరలోనే; రాగలడు = వచ్చును; అనుచున్ = అంటూ; పలికిన = చెప్పిన; పలుకులున్ = మాటలను; తలచి = తలచికొని; నమ్మి = నమ్మి; కృతకృత్యుండు = సఫలీకృతుడు {కృతకృత్యుండు - చేయవలసినది నెరవేర్చినవాడు, ధన్యుడు}; ఐ = అయ్యి.

భావము:- (ధ్రువుడు మరలి వస్తున్నాడు) అని ముందు నమ్మనివాడై “నీ కొడుకు తొందరలోనే తిరిగివస్తాడు” అని పూర్వం నారదుడు చెప్పిన మాటలను జ్ఞప్తికి తెచ్చుకొని అటువంటి అదృష్టం లభిస్తుందేమో అని కొంత విశ్వసించి...

4-305-క.

**తన సుతుని రాక చెప్పిన**
**ఘనునకు ధనములును మౌక్తికపు హారములున్**
**మన మలర నిచ్చి తనయునిఁ**
**గనుఁగొను సంతోష మాత్మఁ గడలుకొనంగన్**

టీక:- తన = తన యొక్క; సుతుని = పుత్రుని; రాక = వచ్చుటను; చెప్పిన = చెప్పిన; ఘనునకున్ = గొప్పవానికి; ధనములును = డబ్బులు; మౌక్తికపు = ముత్యాల; హారములున్ = హారములు; మనమునన్ = మనసు; అలరన్ = సంతోషించునట్లుగ; ఇచ్చి = ఇచ్చి; తనయునిన్ = పుత్రుని; కనుగొను = చూసెడి; సంతోషము = సంతోషము; ఆత్మన్ = మనసున; కడలుకొనగన్ = ఉప్పొంగగ.

భావము:- తన కొడుకు వస్తున్నాడని చెప్పిన చారునకు ధనం, ముత్యాల దండలు సంతోషంగా ఇచ్చి, కొడుకును చూడాలనే ఉత్సాహం మనస్సులో ఉప్పొంగగా...

4-306-సీ.

వలను మీఱిన సైంధవంబులఁ బూన్చిన-
కనక రథంబు నుత్కంఠ నెక్కి
బ్రాహ్మణ కుల వృద్ధ బంధు జనామాత్య-
పరివృతుం డగుచు విస్ఫురణ మెఱసి
బ్రహ్మనిర్ఘోష తూర్యస్వన శంఖ కా-
హళ వేణు రవము లందంద చెలఁగ
శిబిక లెక్కియు విభూషితలై సునీతి సు-
రుచు లుత్తముండు నారూఢి నడువ

4-306.1-తే.

గరిమ దీపింప నతిశీఘ్రగమన మొప్ప
నాత్మనగరంబు వెలువడి యరుగుచుండి
బలసి నగరోపవన సమీపంబు నందు
వచ్చు ధ్రువుఁ గని మేదినీశ్వరుఁడు నంత.

టీక:- వలనుమీఱిన = వడిగల; సైంధవంబులన్ = గుఱ్ఱములను; పూన్చిన = పూన్చిన; కనక = బంగారు; రథంబున్ = రథమును; ఉత్కంఠను = ఉత్సాహముతో; ఎక్కి = ఎక్కి; బ్రాహ్మణ = బ్రాహ్మణులు; కులవృద్ధ = వంశమున పెద్దలు; బంధు = చుట్టములు; జనా = ప్రజలు; అమాత్య = మంత్రులచే; పరివృతుండు = చుట్టునున్నవాడు; అగుచున్ = అవుతూ; విస్ఫురణన్ = వైభవముతో; మెఱసి = విలసిల్లి; బ్రహ్మనిర్ఘోష = వేదఘోష; తూర్యస్వన = వాయిద్యముల శబ్దములు; శంఖ = శంఖము; కాహళ = బాకాలు; వేణు = వేణువుల; రవములున్ = శబ్దములు; అందంద = మరిమరి; చెలగన్ = చెలరేగగ; శిబికలు = పల్లకీలు; ఎక్కియు = ఎక్కి; విభూషితలు = అలంకరింపబడినవారు; ఐ = అయ్యి; సునీతి = సునీతి; సురుచులు = సురుచియును; ఉత్తముండు = ఉత్తముడును; ఆరూఢిన్ = ఎక్కి; నడువ = అనుసరింపగ.`

గరిమ = వైభవము; దీపింపన్ = ప్రకాశిస్తుండగ; అతి = మిక్కిలి; శీఘ్ర = వేగవంతమైన; గమనము = ప్రయాణము; ఒప్పన్ = ఒప్పుతుండగ; ఆత్మ = స్వంత; నగరంబున్ = నగరమునుండి; వెలువడి = బయవుదేరి; అరుగుచుండి = వెళ్ళుతూ; బలిసి = గుంపుగ; నగర = నగరముయొక్క; ఉపవనమునన్ = వెలుపలి తోట; సమీపమునందు

= దగ్గరలో; వచ్చు = వస్తున్న; ధ్రువున్ = ధ్రువుని; కని = చూసి; మేదినీశ్వరుడు = రాజు {మేదినీశ్వరుడు – మేదిని (భూమి)కి ఈశ్వరుడు (ప్రభువు), రాజు}; అంత = అంతట.

భావము:- వడిగల గుఱ్ఱాలను పూన్చిన బంగారు రథాన్ని ఆత్రంగా ఎక్కి, బ్రాహ్మణులతో కులవృద్ధులతో బంధు మిత్రులతో మంత్రులతో కలసి బయలుదేరాడు. వేదఘోషలు, వాద్యధ్వనులు, శంఖ కాహళ వేణు నాదాలు అతిశయించాయి. పెద్దభార్య సునీతి, చిన్నభార్య సురుచి బంగారు పల్లకీలెక్కి ఉత్తమునితో కూడి అనుసరించారు. అలా వేగంగా ముందుకు సాగి వెళ్తూ పురం వెలుపల ఉపవనం సమీపాన అల్లంత దూరంనుండి వస్తున్న ధ్రువకుమారుణ్ణి ఉత్తానపాదుడు చూచి...

4-307-చ.

అరదము డిగ్గి ప్రేమ దొలఁకాడ ససంభ్రముఁడై రమామనో
హరు చరణారవింద యుగళార్చన నిర్దళితాఖి లాఘు నీ
శ్వర కరుణావలోకన సుజాత సమగ్ర మనోరథున్ సుతుం
గర మనురక్తి డాసి పులకల్ ననలొత్తఁ బ్రమోదితాత్ముఁడై.

టీక:- అరదము = రథము; డిగ్గి = దిగి; ప్రేమ = ప్రేమ; తొలకాడ = తొణికిసలాడ; ససంభ్రముడు = మిక్కిలి కుతూహలము కలవాడు; ఐ = అయ్యి; రమామనోహరు = హరి {రమా మనోహరుడు – రమ (లక్ష్మీదేవి) మనోహరుడు (భర్త), విష్ణువు}; చరణ = పాదములు అనెడి; అరవింద = పద్మముల; యుగళ = జంటను; అర్చన = పూజించుటచే; నిర్దళిత = చక్కగ భేదించబడిన; అఖిల = సమస్తమైన; అఘున్ = పాపములు కలవానిని; ఈశ్వర = హరి; కరుణ = దయతో; ఆలోకన = చూచుటచేత; సు = చక్కగ; జాత = కలిగిన; సమగ్ర = పరిపూర్తి చెందిన; మనోరథున్ = కోరికలు గలవానిని; సుతున్ = పుత్రుని; కరము = మిక్కిలి; అనురక్తిన్ = ప్రీతితో; డాసి = దగ్గరకు వెళ్ళి; పులకల్ = పులకరింతలు; ననలొత్త = చిగురించగ; ప్రమోదితాత్ముడు = సంతోషించిన మనసు కలవాడు; ఐ = అయ్యి.

భావము:- రథం దిగి, అనురాగం పొంగిపొరలగా సంభ్రమంతో ధ్రువునికి ఎదురువెళ్ళాడు. శ్రీపతి పాదపద్మాలను సేవించి పాపాలను పోగొట్టుకొని, ఆ భగవంతుని కరుణాకటాక్షం వల్ల కోరికలు తీర్చుకున్న తన కుమారుని సమీపించి ప్రేమతో పులకించిపోతూ సంతోషంగా...

4-308-తే.

బిగియఁ గౌఁగిటఁ జేర్చి నెమ్మొగము నివిరి
శిరము మూర్కొని చుబుకంబు చేతఁ బుణికి
యవ్యయానంద బాష్ప ధారాభిషిక్తుఁ
జేసి యాశీర్వదింప నా చిరయశుండు.

టీక:- బిగియన్ = గట్టిగ; కౌగిటజేర్చి = కౌగిలించుకొని; నెఱి = నిండు; మొగమున్ = ముఖమును; నివిరి = నివిరి; శిరమున్ = తలను; మూర్కొని = వాసనచూసి; చుబుకంబున్ = గడ్డము; చేతన్ = చేతితో; పుణికి = పుణికి; అవ్యయ = అంతులేని; ఆనంద = ఆనందపు; బాష్ప = కన్నీటి; ధార = ధారలతో; అభిషిక్తున్ = తడసినవానిని; చేసి = చేసి; ఆశీర్వాదింపన్ = ఆశీర్వదించగ; ఆ = ఆ; చిర = మిక్కిలి; యశుండు = యశస్సు కలవాడు.

భావము:- గట్టిగా కౌగిలించుకొని, ముఖం నిమిరి, శిరస్సు మూర్కొని, గడ్డం పుణికి, జలజల ప్రవహించే ఆనందబాష్పాలతో పుత్రుని శిరస్సును అభిషేకించి ఉత్తానపాదుడు ఆశీర్వదించగా, చిరకీర్తివంతుడైన పుత్రుడు ఆ ధ్రువుడు...

4-309-క.

జనకుని యాశీర్వచనము
లనయముఁ గైకొని ప్రమోదియై తత్పదముల్
దన ఫాలతలము సోఁకఁగ
వినతులు గావించి భక్తి విహ్వలుఁ డగుచున్.

టీక:- జనకుని = తండ్రి; ఆశీర్వచనమున్ = ఆశీర్వచనములు; అనయమున్ = ఆవశ్యము; కైకొని = స్వీకరించి; ప్రమోది = సంతోషించినవాడు; ఐ = అయ్యి; తత్ = అతని; పాదముల్ = పాదములను; తన = తన యొక్క; ఫాలతలము = నుదురు; సోకగన్ = తగులునట్లు; వినతులు = నమస్కారములు; కావించి = చేసి; భక్తిన్ = భక్తిచే; విహ్వాలుడు = తూగుతున్నవాడు; అగుచున్ = అవుతూ.

భావము:- తండ్రి దీవనలను అందుకొని ఆనందించి అతని పాదాలపై నుదురు మోపి భక్తి తన్మయుడై నమస్కరించాడు.

4-310-తే.

అంత నా సజ్జనాగ్రణి యైన ధ్రువుఁడు
దల్లులకు భక్తి వినతులు దగ నొనర్చి
సురుచికిని మ్రొక్క నర్భకుఁ జూచి యెత్తి
నగు మొగంబున నాలింగనంబు చేసి.

టీక:- అంతన్ = అంతట; ఆ = ఆ; సత్ = మంచి; జన = వారిలో; అగ్రణి = గొప్పవాడు; ఐన = అయిన; ధ్రువుడు = ధ్రువుడు; తల్లులకు = తల్లులకు; భక్తిన్ = భక్తితో; వినతులు = నమస్కారములు; తగన్ = తగ; ఒనర్చి = చేసి; సురుచి = సురుచి; కిని = కి; మ్రొక్క = నమస్కరించగ; అర్భకుని = పిల్లవానిని; చూచి = చూసి; యెత్తి = లేవనెత్తి; నగు = నవ్వు; మొగంబునన్ = ముఖముతో; ఆలింగనంబు = కౌగలించుకొనుట; చేసి = చేసి.

భావము:- సజ్జనులలో గొప్పవాడైన ఆ ధ్రువుడు తల్లులకు భక్తితో నమస్కరించాడు. సురుచి తనకు మ్రొక్కిన ధ్రువుణ్ణి లేవనెత్తి నవ్వుతూ అక్కున జేర్చుకొని...

4-311-సీ.

కరమొప్ప నానంద గద్గద స్వరమున-
జీవింపు మనుచు నాశీర్వదించె;
భగవంతుఁ డెవ్వనిపై మైత్రి పాటించు-
సత్కృపానిరతిఁ బ్రసన్నుఁ డగుచు
నతనికిఁ దమయంత ననుకూలమై యుండు-
సర్వభూతంబులు సమతఁ బేర్చి
మహిఁ దలపోయ నిమ్నప్రదేశములకు-
ననయంబుఁ జేరు తోయముల పగిది

4-311.1-తే.

గాన ఘను నమ్మహాత్ముని గారవించె
సురుచి పూర్వంబు దలఁపక సుజనచరిత!
విష్ణుభక్తులు ధరను బవిత్రు లగుట
వారి కలుగరు ధరణి నెవ్వారు మఱియు.

టీక:- కరము = అతిశయించి; ఒప్పన్ = చక్కనైన; ఆనంద = ఆనందమువలన; గద్గదము = బొంగురుపోయిన; స్వరమున = గొంతుకతో; జీవింపుము = జీవింపుము; అని = అని; ఆశీర్వదించె = ఆశీర్వదించెను; భగవంతుడు = విష్ణువు; ఎవ్వని = ఎవని; పై = పైన; మైత్రి = స్నేహము; పాటించున్ = చూపునో; సత్ = మంచి; కృప = దయ యొక్క; నిరతి = శ్రద్ధతో; ప్రసన్నుడు = ప్రసన్నమైనవాడు; అగుచున్ = అవుతూ; అతనికిన్ = అతనికి; తమ యంతన = తమంతతామే; అనుకూలము = అనుకూలము; ఐ; ఉండున్ = ఉండును; సర్వ = సమస్తమైన; భూతంబులు = జీవులును; సమతన్ = సమత్వము; పేర్చి = అతిశయించగ; మహిన్ = భూమిపైన; తలపోయ = ఆలోచించినచో; నిమ్న = పల్లపు; ప్రదేశముల్ = చోటి; కున్ = కి; అనయంబున్ = అవశ్యము; చేరు = చేరెడి; తోయములన్ = నీటి; పగిది = పగిదిన్; కాన = కావున.

ఘనున్ = గొప్పవానిని; ఆ = ఆ; మహాత్మునిన్ = మహాత్ముని; గారవించె = గౌరవించెను; సురుచి = సురుచి; పూర్వంబున్ = పాత సంగతులు; తలపక = స్మరించక; సుజనచరిత = మంచివారి నడవడిక గలవాడ; విష్ణుభక్తులు = విష్ణుమూర్తి యొక్క భక్తులు; ధరనున్ = భూమికి; పవిత్రులు = పవిత్రమైనవారు; అగుటన్ = అవుటచేత; వారి = వారి;

కిన్ = కి; అలుగరు = కోపించరు; ధరణిన్ = భూమిపైన; ఎవ్వారున్ = ఎవరుకూడ; మఱియు = ఇంకను.

భావము:- (సురుచి) ఆనందంతో వణుకుతున్న కంఠస్వరంతో “చిరంజీవ!” అని దీవించింది. పల్లమునకు నీళ్ళు ప్రవహించిన విధంగా భగవంతుని దయకు పాత్రుడైన వాని వద్దకు అందరూ తమంత తామే అనుకూల భావంతో చేరుకుంటారు. అందువల్లనే సురుచి గతాన్ని మరచిపోయి మహనీయుడైన ధ్రువుణ్ణి గౌరవించింది. నాయనా, విదురా! విష్ణుభక్తులు పరమపవిత్రులు. వారికి శత్రువులంటూ ఎవరూ ఉండరు. వారిపై ఎవ్వరూ కోపించరు.

4-312-వ.

## కావున నుత్తముండును ధ్రువుండును బ్రేమ విహ్వలు లగుచు నన్యో న్యాలింగితులై పులకాంకురాలంకృత శరీరులై యానంద బాష్పముల నొప్పి; రంత సునీతియుం దన ప్రాణంబులకంటెఁ బ్రియుండైన సుతు నుపగూహనంబు చేసి తదవయవ స్పర్శనంబు చేత నానందంబు నొంది విగతశోక యయ్యెఁ; నప్పుడు సంతోష బాష్ప ధారాసిక్తంబులై చనుఁబాలునుం గురిసె నంత.

టీక:- కావునన్ = అందుచేత; ఉత్తముండును = ఉత్తముడును; ధ్రువుండును = ధ్రువుడును; ప్రేమ = ప్రేమతో; విహ్వలులు = చలిస్తున్నవారు; అగుచున్ = అవుతూ; అన్యోన్య = ఒకరినొకరు; ఆలింగితులు = కౌగలించుకొన్నవారు; ఐ = అయ్యి; పులకా = పులకరింతలు; అంకుర = చిగురించుట అనెడి; అలంకృత = అలంకారము ధరించిన; శరీరులు = దేహములు కలవారు; ఐ = అయ్యి; ఆనంద = ఆనందము వలని; బాష్పములన్ = ఆశ్రువులచే; ఒప్పిరి = ఒప్పి యుండిరి; అంతన్ = అంత; సునీతియున్ = సునీతి; తన = తన యొక్క; ప్రాణంబుల్ = ప్రాణములు; కంటెన్ = కంటె; ప్రియుండు = ఇష్టుడు; ఐన = అయిన; సుతున్ = పుత్రుని; ఉపగూహనంబున్ = కౌగలింతలు; చేసి = చేసి; తత్ = అతని; అవయవ = అవయవముల; స్పర్శనంబున్ = స్పర్శించుట; చేతన్ = చే; ఆనందంబునున్ = సంతోషమును; ఒంది = పొంది; విగత = పోయిన; శోక = శోకము కలది; అయ్యెన్ = అయినది; అప్పుడు = అప్పుడు; సంతోష = ఆనంద; బాష్ప = ఆశ్రువుల; ధారా = ధారలతో; సిక్తంబులు = తడసినవి; ఐ = అయ్యి; చనుబాలునున్ = స్తన్యముకూడ; కురిసెన్ = కురిసినది; అంతన్ = అంతట.

భావము:- కనుక, ఉత్తముడు ధ్రువుడు ప్రేమతో ఒడలు మరచి ఒకరినొకరు కౌగలించుకున్నారు. వారి శరీరాలు పులకరించాయి. వారి కనులలో ఆనంద బాష్పాలు నిండాయి. అప్పుడు సునీతి తన ప్రాణాలకంటే ఎక్కువ ప్రీతిపాత్రుడైన కొడుకును గట్టిగా

కౌగిలించుకొని అతని తనూస్పర్శ వల్ల కలిగిన సంతోషంతో తన దుఃఖాన్ని మరిచిపోయింది. ఆనందబాష్పాలతో తడిసిన ఆ తల్లి పాలిండ్లు పొంగులెత్తాయి.

4-313-సీ.

ఉన్నత సంతోష ముప్పతిల్లఁగఁ బౌర-
జనము లా ధ్రువుతల్లి నెనయఁ జూచి
"తొడరిన భవదీయ దుఃఖనాశకుఁ డైన-
యిట్టి తనూజుఁ డెందేని పెద్ద
కాలంబు క్రిందటఁ గడఁగి నష్టుం డైన-
వాఁడిప్డు నీ భాగ్యవశము చేతఁ
బ్రతిలబ్ధుఁ డయ్యెను; నితఁడు భూమండల-
మెల్లను రక్షించు నిద్ధమహిమ;

4-313.1-తే.

కమల లోచనుఁ జింతించు ఘనులు లోక
దుర్జయం బైన యట్టి మృత్యువును గెల్తు;
రట్టి ప్రణతార్తి హరుఁడైన యబ్జనాభుఁ
డర్థి నీచేతఁ బూజితుం డగుట నిజము."

టీక:- ఉన్నత = అదికమైన; సంతోషమున్ = ఆనందము; ఉప్పతిల్లగన్ = పొంగి పొర్లిపోగా; పౌరజనములు = పౌరులు; ఆ = ఆ; ధ్రువు = ధ్రువుని; తల్లిన్ = తల్లిని; ఎనయన్ = పొందికగ; చూచి = చూసి; తొడరిన = కలిగిన; భవదీయ = నీ యొక్క; దుఃఖ = దుఃఖమును; నాశకుడు = నాశనముచేసిన వాడు; ఐన = అయిన; ఇట్టి = ఇటువంటి; తనూజుడు = పుత్రుడు {తనూజుడు - తనువున పుట్టినవాడు, పుత్రుడు}; ఎందేని = ఎక్కడైన; పెద్ద = చాలా; కాలంబు = కాలము; క్రిందటన్ = కిందట; కడగి = పూని; నష్టుండు = పోయినవాడు; ఐన = అయిన; వాడు = వాడు; ఇప్డు = ఇప్పుడు; నీ = నీ యొక్క; భాగ్య వశము = అదృష్టము; చేతన్ = కొలది; ప్రతిలబ్ధుడు = తిరిగిదొరకినవాడు; అయ్యెను = ఆయెను; ఇతడున్ = ఇతడు; భూమండలము = మొత్తము భూలోకము; ఎల్లను = సమస్త మును; రక్షించు = కాపాడు; ఇద్ధ = ప్రసిద్ధ; మహిమన్ = మహిమతో.

కమలలోచను = విష్ణుని; చింతించు = ధ్యానించు; ఘనులు = గొప్పవారు; లోక = లోకమంతటను; దుర్జయంబు = జయింపరానిది; ఐన = అయిన; అట్టి = అటువంటి; మృత్యువునున్ = మృత్యువును కూడ; గెల్తురు = గెలుస్తారు; అట్టి = అటువంటి; ప్రణత = ప్రపన్నులైన భక్తుల; ఆర్తి = బాధను; హరుడు = హరించువాడు; ఐన = అయిన;

అబ్జనాభుడు = విష్ణువు {అబ్జనాభుడు - అబ్జము (పద్మము) నాభిన కలవాడు, విష్ణువు}; అర్థిన్ = కోరి; నీ = నీ; చేతన్ = చేత; పూజితుడు = పూజింపబడినవాడు; అగుటన్ = అయియుండుట; నిజము = నిజము.

భావము:- పురజనులు ధ్రువుని తల్లియైన సునీతిని చూచి అంతులేని సంతోషంతో "చాలాకాలం క్రిందట కనిపించకుండా పోయిన నీ కొడుకు నీ అదృష్టం వల్ల మళ్ళీ తిరిగి వచ్చాడు. నీ దుఃఖాన్ని తొలగించాడు. ఇతడు సాటిలేని పరాక్రమంతో భూమండలాన్ని పరిపాలిస్తాడు. విష్ణువును సేవించే మహాత్ములు అజేయమైన మృత్యువును కూడా జయిస్తారు. ప్రపన్నులైన భక్తుల దుఃఖాన్ని తొలగించే నారాయణుని నీవు నిజంగా ఆరాధించావు."

4-314-వ.

**అని ప్రశంసించి; రట్లు పౌరజనంబులచేత నుపలాల్య మానుండగు ధ్రువుని నుత్తానపాదుం డుత్తమ సమేతంబుగా గజారూఢునిం జేసి సంస్తూయమానుండును, ప్రహృష్టాంతరంగుండును నగుచుఁ బురాభిముఖుండై చనుదెంచి.**

టీక:- అని = అని; ప్రశంసించిరి = పొగిడిరి; అట్లు = అలా; పౌరజనంబుల = పౌరుల; చేతన్ = చేత; ఉపలాల్యమానుండు = బుజ్జగింపబడుతున్నవాడు; అగు = అయిన; ధ్రువుని = ధ్రువుని; ఉత్తానపాదుడు = ఉత్తానపాదుడు; ఉత్తమ = ఉత్తముని; సమేతంబుగా = తో కూడ; గజా = ఏనుగును; ఆరూఢునిన్ = ఎక్కినవానిగా; చేసి = చేసి; సంస్తూయమానుండు నున్ = స్తుతింపబడుతున్నవాడును; ప్రహృష్ట = సంతోషముతో కూడిన; అంతరంగుండు = అంతరంగము కలవాడు; అగుచున్ = అవుతూ; పుర = నగరము; అభిముఖుండు = వైపునకు పోవువాడు; ఐ = అయ్యి; చనుదెంచి = వచ్చి.

భావము:- అని పౌరజనులు ప్రశంసించారు. ఆ విధంగా పౌరులచేత ఉపలాలింప బడుతున్న ధ్రువుణ్ణి ఉత్తానపాదుడు ఉత్తమునితో కూడా ఏనుగుపైన కూర్చుండ బెట్టి, ప్రజల ప్రస్తుతులను అందుకుంటూ మనస్సులో పొంగిపొరలే సంతోషంతో పురం వైపు బయలుదేరి వచ్చి...

4-315-సీ.

**స్వర్ణ పరిచ్ఛదస్వచ్ఛకుడ్యద్వార-**
**లాలిత గోపురాట్టాలకంబు;**
**ఫల పుష్ప మంజరీ కలిత రంభా స్తంభ-**
**పూగ పోతాది విభూషితంబు;**
**ఘన సార కస్తూరికా గంధ జలబంధు-**
**రాసిక్త విపణి మార్గాంచితంబు;**

**మానిత నవరత్న మయ రంగవల్లీ వి-**

**రాజిత ప్రతి గృహ ప్రాంగణంబు;**

4-315.1-తే.

**శుభ నదీజల కుంభ సంశోభితంబు;**

**తండులస్వర్ణలాజాక్షతప్రసూన**

**ఫల బలివ్రాత కలిత విభ్రాజితంబు;**

**నగుచు సర్వతోలంకృత మైన పురము.**

టీక:- స్వర్ణ = బంగారు; పరిచ్ఛద = ఇండ్ల పైకప్పులు; స్వచ్ఛ = నిర్మలమైన; కుడ్య = గోడలు; ద్వార = గుమ్మములు; లాలిత = అందమైన; గోపుర = గోపురములు; అట్టాల కంబున్ = కోటబురుజులు కలది; ఫల = పండ్లు; పుష్ప = పువ్వులు; మంజరీ = పూల గుత్తులు; కలిత = కూడిన; రంభా = అరటి; స్తంభ = స్తంభములు; పూగపోత = పోకచెట్ల బోదెలు; ఆది = మొదలగు; విభూషితంబున్ = చక్కగా అలంకరిపబడినది; ఘనసార = కర్పూరము; కస్తూరికా = కలస్తూరిలతోకూడిన; గంధ = సువాసనల; జల = నీటిచో; బంధుర = చిక్కగా; ఆసిక్త = బాగుగా తడపబడిన; విపణీ = వాణిజ్యపు; మార్గ = దారి; అంచి తంబున్ = అలంకరింపబడినది; మానిత = గౌరవింపదగ్గ; నవరత్న = నవరత్నములతో {నవరత్నములు - 1మౌక్తికము (ముత్యము) 2పద్మరాగము 3వజ్రము 4ప్రవాళము 5మరకతము 6నీలము 7గోమేధికము 8పుష్యరాగము 9వైఢూర్యము}; మయ = కలిగిన; రంగవల్లీ = ముగ్గులతో; విరాజిత = విసిల్లుతున్న; ప్రతి = ప్రతి; గృహ = గృహము యొక్క; ప్రాగణంబు = ముంగిలులుకలది.

శుభ = శుభమైన; నదీ = నది; జల = నీటి; కుంభ = కుండలతో; సంశోభితంబున్ = చక్కగాశోభిల్లుతున్నది; తండుల = బియ్యము; స్వర్ణ = బంగారము; లాజ = పేలాల; అక్షత = అక్షతలు; ప్రసూన = పూలు; ఫల = పండ్లు; బలి = బలుల; వ్రాత = సమూహముల; కలిత = కూడి; విభ్రాజితంబున్ = ప్రకాశిస్తున్నది; అగుచున్ = అవుతూ; సర్వతః = అన్నిదిక్కులను, అన్నిరకములుగ; అలంకృతము = అలంకరింపబడినది; ఐన = అయిన; పురమున్ = నగరమును.

భావము:- గోడలు, తలుపులు, గోపురాలు బంగారు పూతతో తళతళ మెరుస్తున్నాయి. పండ్లతోను పూలగుత్తులతోను నిండిన అరటి స్తంభాలు, చిన్న చిన్న పోకచెట్లు వీధికి ఇరువైపుల కనువిందు చేస్తున్నాయి. అంగళ్ళముందు పచ్చకర్పూరం, కస్తూరి, చందనం కలిపిన నీళ్ళు చల్లారు. ప్రతి ఇంటి ముంగిట్లోను నవరత్నాలతో ముగ్గులు తీర్చి దిద్దారు. పవిత్ర నదీజలాలతో నిండిన మంగళ కలశాలు నిలిపారు. బంగారు లాజలు, అక్షతలు, పూలు, పండ్లు పూజాద్రవ్యాలు సిద్ధపరిచారు. ఈ విధంగా అలంకరింపబడిన పట్టణంలోకి...

4-316-వ.

**ప్రవేశించి రాజమార్గంబునఁ జనుదెంచు నప్పుడు.**

టీక:- ప్రవేశించి = ప్రవేశించి; రాజమార్గంబునన్ = ప్రధానవీథిలో; చనుదెంచు = వెళ్ళెడి; అప్పుడు = సమయమున.

భావము:- అలా ఉత్తానపాదుడు తన కొడుకు ధ్రువునితో ప్రవేశించి రాజమార్గం గుండా వస్తున్న సమయంలో...

4-317-మ.

**హరిమధ్యల్ పురకామినీ తతులు సౌధాగ్రంబులందుండి భా**
**స్వర సిద్ధార్థ ఫలాక్షతప్రసవ దూర్వావ్రాత దధ్యంబువుల్**
**కరవల్లీ మణి హేమ కంకణ ఝణత్కారంబు శోభిల్లఁ జ**
**ల్లిరి యా భాగవతోత్తమోత్తమునిపై లీలాప్రమేయంబుగన్.**

టీక:- హరి = సింహమువంటి {హరిమధ్యలు - హరి (సింహము) వంటి మధ్యలు (నడుములు కలవారు), స్త్రీలు}; మధ్యల్ = నడుముల కలవారు; పుర = నగర; కామినీ = స్త్రీ; తతులు = సమూహములు; సౌధా = మేడల; అగ్రంబులన్ = పైన; ఉండి = ఉండి; భాస్వర = తళుకుమంటున్న; సిద్ధార్థ = తెల్లావాలు; ఫల = పండ్లు; అక్షత = అక్షింతలు; ప్రసవ = పూలు; దూర్వా = గరికల; వ్రాత = కూడిన; దధి = పెరుగు; అంబువుల్ = నీళ్ళు; కర = చేతులు అనెడి; వల్లీ = పూలతీగల; మణి = మణులుపొదిగిన; హేమ = బంగారు; కంకణ = కంకణముల; ఝణత్కారంబున్ = ఝణఝణ మనెడి ధ్వనులు; శోభిల్లన్ = శోభిల్లుతుండగ; చల్లిరి = చల్లిరి; ఆ = ఆ; భాగవత = భాగవతులలో; ఉత్తమోత్తము = అత్యుత్తము; పైన్ = పైని; లీలా = విలాసముల; ప్రమేయంబుగాన్ = సంగతులుగా.

భావము:- సన్నని సింగపు నడుములు గల పురస్త్రీలు ఒయ్యారంగా మేడలపై నిలబడి, చేతులకు ధరించిన మణులు తాపిన బంగారు గాజులు ఝణఝణ ధ్వనులు చేస్తుండగా ఆ ఉత్తమోత్తముడైన భగవద్భక్తునిపై తెల్లావాలు, పండ్లూ, పూలు, అక్షతలు, దూర్వాంకురాలు, పెరుగు కలిపిన నీళ్ళను చల్లారు.

4-318-వ.

**ఇట్లు వాత్సల్యంబునం జల్లుచు సత్యవాక్యంబుల దీవించుచు సువర్ణ పాత్ర రచిత మణి దీప నీరాజనంబుల నివాళింపం బౌర జానపద మిత్రామాత్య బంధుజన పరివృతుండై చనుదెంచి.**

టీక:- ఇట్లు = ఈ విధముగ; వాత్సల్యంబునన్ = అభిమానముతో; జల్లుచున్ = జల్లుతూ; సత్యవాక్యంబులన్ = సత్యవాక్యములతో; దీవించుచున్ = దీవిస్తూ; సువర్ణ =

బంగారు; పాత్ర = పాత్రలుచే; రచిత = చేసిన; మణిదీప = మణిదీపముల; నీరాజనంబులన్ = మంగళహారతులను; నివాళింపన్ = హారతు లివ్వగా; పౌర = పౌరులు; జానపద = జానపదులు; మిత్ర = మిత్రులు; అమాత్య = మంత్రులు; బంధు = బంధువులు; జన = ప్రజలుచే; పరివృతుండు = కూడినవాడు; ఐ = అయ్యి; చనుదెంచి = వచ్చి.

భావము:- ఈ విధంగా ప్రేమతో చల్లుతూ యథార్థవాక్కులతో దీవిస్తూ, బంగారు పాత్రలలో మణిదీపాలుంచి హారతు లివ్వగా ధ్రువుడు పౌరులతో, జానపదులతో, మిత్రులతో, మంత్రులతో, బంధువులతో కలిసి ముందుకు సాగి...

4-319-సీ.

**కాంచన మయ మరకత కుడ్య మణిజాల-**
**సంచయ రాజిత సౌధములను**
**వరసుధా ఫేన పాండుర రుక్మ పరికరో-**
**దాత్త పరిచ్ఛదతల్పములను**
**సురతరు శోభిత శుక పిక మిథునాళి-**
**గాన విభాసి తోద్యానములను**
**సుమహిత వైడూర్య సోపాన విమల శో-**
**భిత జలపూర్ణ వాపీచయముల**

4-319.1-తే.

**వికచ కహ్లార దర దరవింద కైర**
**వప్రదీపిత బక చక్రవాక రాజ**
**హంస సారస కారండవాది జల వి**
**హంగ నినదాభిరామ పద్మాకరముల.**

టీక:- కాంచన = బంగారమున; మయ = తాపిన; మరకత = పచ్చల; కుడ్య = గోడల; మణి = మణుల; జాల = కిటికీల; సంచయ = సమూహములుకలిగిన; రంజిత = ప్రకాశించు; సౌధములను = మేడలను; వర = శ్రేష్ఠమైన; సుధా = అమృతపు; ఫేన = నురుగ వలె; పాండుర = తెల్లని; రుక్మ = బంగారపు; పరికర = చుట్టంచులుగల; ఉదాత్త = ఉత్తమమైన; పరిచ్ఛద = దుప్పట్లుగల; తల్పములను = మంచములును; సురతరు = కల్పవృక్షములతో {సురతరువు - దేవతల చెట్టు, కల్పవృక్షము}; శోభిత = శోభిల్లుతున్న; శుక = చిలుకలు; పిక = నెమళ్ళు; మిథునా = జంటలు; ఆళి = తుమ్మెదల; గాన = గానములతో; విభాసిత = ప్రకాశిస్తున్న; ఉద్యానములను = ఉద్యానవనములును; సు = మంచి; మహిత = గొప్ప; వైడూర్య = వైడూర్యముల; సోపాన = మెట్లుగల; విమల =

నిర్మలముగ; శోభిత = శోభిస్తున్న; జల = నీటితో; పూర్ణ = నిండిన; వాపీ = నడబావుల, కోనేర్ల; చయముల = సమూహముల.

వికచ = వికసించిన; కహ్లార = ; దరత్ = అరవిచ్చిన; అరవింద = కమలములు; కైరవ = తెల్లకలువలతో; ప్రదీపిత = విరాజిల్లుతున్న; బక = కొంగ; చక్రవాక = చక్రవాకములు; రాజహంస = రాయంచలు; సారస = బెగ్గరు పక్షులు; కారండవ = కన్నెలేడి (నీటికాకి) పక్షులు; ఆది = మొదలగు; జల = నీటి పక్షుల; నినద = అరుపులతో; అభిరామ = మనోహరంబగుచున్న; పద్మాకరముల = సరస్సుల.

భావము:- ధ్రువుడు నగరంలోకి ప్రవేశించాడు. అక్కడి మేడలు పచ్చలు తాపిన బంగారు గోడలతోను, మణిఖచితాలైన గవాక్షాలతోను మెరిసిపోతున్నవి. పట్టెమంచాల పరుపులపై పాలనురుగువలె తెల్లనైన బంగారు జరీ అంచుల దుప్పట్లు పరచబడి ఉన్నాయి. ఉద్యానవనాలు కల్పవృక్షాలతో నిండి చిలుకలు, కోయిలలు, తుమ్మెదల జంటలు పాడే పాటలతో మారుమ్రోగుతున్నాయి. దిగుడు బావులు వైడూర్యాలతో కట్టిన మెట్లతో నిర్మలమైన జలంతో నిండి ప్రకాశిస్తున్నాయి. వికసించిన కలువలతో, కమలాలతో విరాజుల్లుతూ కొక్కెరలు, జక్కవలు, రాయంచలు, బెగ్గురు పక్షులు, కన్నెలేళ్ళు మొదలైన నీటి పక్షుల కలకల ధ్వనులతో అక్కడి దొరువులు, చెరువులు అలరారుతున్నాయి.

4-320-వ.

మఱియును.

టీక:- మఱియును = ఇంకను.

భావము:- ఇంకా...

4-321-తే.

చారు బహువిధ వస్తు విస్తార మొప్ప
నంగనాయుక్త మగుచుఁ బెం పగ్గలించి
యర్థిఁ దనరారు జనకుగృహంబు చొచ్చె
నెలమిఁ ద్రిదివంబు చొచ్చు దేవేంద్రు పగిది.

టీక:- చారు = అందమైన; బహువిధ = అనేక; వస్తు = పదార్థములు; విస్తారమున్ = పుష్కలముగా; ఒప్పన్ = కలిగియుండి; అంగనా = స్త్రీలతో; యుక్తము = కూడినది; అగుచున్ = అవుతూ; పెంపగ్గలించి = అతిశయించి; అర్థిన్ = సంపదలతో; తనరారు = విలసిల్లుతున్న; జనకు = తండ్రి; గృహంబున్ = ఇంటిని; చొచ్చెన్ = ప్రవేశించెను; ఎలమిన్ = సంతోషముతో; త్రిదివంబున్ = స్వర్గమును {త్రిదివము – మూడవ లోకము, స్వర్గము}; చొచ్చు = ప్రవేశించు; దేవేంద్రు = దేవేంద్రుని; పగిదిన్ = వలె.

భావము:- ఎన్నెన్నో సుందర వస్తువులతోను, సుందరీమణులతోను కలకల లాడుతూ కనువిందు చేస్తున్న రాజప్రాసాదంలో స్వర్గంలో దేవేంద్రుడు ప్రవేశించినట్లు ధ్రువుడు ప్రవేశించాడు.

4-322-వ.

ఇట్లు ప్రవేశించిన రాజర్షి యైన యుత్తానపాదుండు సుతుని యాశ్చర్యకరంబైన ప్రభావంబు వినియుం జూచియుం మనంబున విస్మయంబు నొంది ప్రజానురక్తుండును, బ్రజాసమ్మతుండును, నవ యౌవ్వన పరిపూర్ణుండును నైన ధ్రువుని రాజ్యాభిషిక్తుం జేసి వృద్ధ వయస్కుండైన తన్నుఁదాన యెఱింగి యాత్మగతిఁబొంద నిశ్చయించి విరక్తుండై వనంబునకుం జనియె; నంత నా ధ్రువుండు శింశుమార ప్రజాపతి కూఁతురైన భ్రమి యను దాని వివాహంబై దానివలనఁ గల్ప, వత్సరు లను నిద్దఱు గొడుకులం బడసి; వెండియు వాయుపుత్త్రియైన యిల యను భార్యయందు నుత్కల నామకుఁడైన కొడుకు నతి మనోహర యైన కన్యకారత్నంబునుం గనియె; నంత దద్భ్రాత యైన యుత్తముండు వివాహంబు లేకుండి మృగయార్థంబు వనంబున కరిగి హిమవంతంబున యక్షునిచేత హతుండయ్యెఁ; నతని తల్లియుఁ దద్దుఃఖంబున వనంబున కేఁగి యందు గహనదహనంబున మృతిం బొందె; ధ్రువుండు భ్రాతృమరణంబు విని కోపామర్షశోకవ్యాకులిత చిత్తుండై జైత్రంబగు రథంబెక్కి యుత్తరాభిముఖుండై చని హిమవ ద్ద్రోణి యందు భూతగణ సేవితంబును గుహ్యక సంకులంబును నైన యలకాపురంబు బొడగని యమ్మహాబాహుండు.

టీక:- ఇట్లు = ఈ విధముగ; ప్రవేశించిన = ప్రవేశించగా; రాజర్షి = రాజులలో ఋషి; ఐన = అయిన; ఉత్తానపాదుండు = ఉత్తానపాదుడు; సుతుని = పుత్రుని; ఆశ్చర్యకరంబులు = ఆశ్చర్యమును కలిగించెడివి; ఐన = అయిన; ప్రభావంబులు = ప్రభావములను; వినియున్ = విని; చూచియున్ = చూసి; మనంబునన్ = మనసులో; విస్మయంబును = ఆశ్చర్యమును; ఒంది = పొంది; ప్రజ = ప్రజల యందు; అనురక్తుండును = అనురాగము కలవాడును; ప్రజా = ప్రజల; సమ్మతుండును = అంగీకార మైనవాడును; నవయౌవ్వన = నవయౌవ్వనముతో; పరిపూర్ణుండును = నిండుగ నున్నవాడును; ఐన = అయిన; ధ్రువునిన్ = ధ్రువుని; రాజ్యాభిషిక్తున్ = రాజ్యాభిషిక్తునిగా; చేసి = చేసి; వృద్ధ = ముసలి; వయస్కుండు = వయస్కుడు; ఐన = అయిన; తన్నుదాన = తననుతాను; ఎఱింగి = తెలుసుకొని; ఆత్మ =

ఆత్మదర్శన; గతిన్ = మార్గమును; పొందన్ = పొందుటను; నిశ్చయించి = నిశ్చయించి; విరక్తుండు = వైరాగ్యము చెందినవాడు; ఐ = అయ్యి; వనంబున్ = అడవికి; చనియెన్ = వెళ్ళెను; అంతన్ = అంతట; ధ్రువుండు = ధ్రువుడు; శింశుమార = శింశుమార {శింశుమార చక్రము– గ్రహ నక్షత్ర మండలములు తిరిగెడు చక్రము}; ప్రజాపతి = ప్రజాపతి; కూతురు = పుత్రిక; ఐన = అయిన; భ్రమి = భ్రమి {భ్రమి — భ్రమించెడిది, తిరిగెడిది}; అను = అనెడి; దానిన్ = ఆమెని; వివాహంబున్ = పెండ్లి; ఐ = అయ్యి; దానిన్ = ఆమె; వలనన్ = అందు; కల్ప = కల్పుడును; వత్సరులు = వత్సరుడును {వత్సరము – సంవత్సరము}; అను = అనెడి; ఇద్దఱున్ = ఇద్దరిని; కొడుకులన్ = పుత్రులను; పడసి = పొంది; వెండియున్ = మరల; వాయు = వాయుదేవుని; పుత్రి = పుత్రిక; ఐన = అయిన; ఇల = ఇల; అను = అనెడి; భార్య = భార్య; అందున్ = అందు; ఉత్కల = ఉత్కలుడు; నామకుడు = అనెడి పేరు కలవాడు; ఐన = అయిన; కొడుకున్ = పుత్రుని; అతి = మిక్కిలి; మనోహర = అందమైనది; ఐన = అయిన; కన్యకా = కన్యలలో; రత్నంబున్ = రత్నమువంటి ఆమెను; కనియెన్ = కనెను; అంతన్ = అంతట; తత్ = అతని; భ్రాత = సోదరుడు; ఐన = అయిన; ఉత్తముండు = ఉత్తముడు; వివాహంబున్ = పెండ్లి; లేకుండి = కాక యుండి; మృగయా = వేట; అర్థంబున్ = కోసము; వనంబున్ = అడవికి; అరిగి = వెళ్ళి; హిమవంతంబునన్ = హిమవత్పర్వతము నందు; యక్షుని = యక్షుని; చేతన్ = చేత; హతుండు = మరణించినవాడు; అయ్యెన్ = ఆయెను; అతని = అతని; తల్లియున్ = తల్లికూడ; తత్ = ఆ; దుఃఖంబునన్ = దుఃఖముతో; వనంబున్ = అడవికి; ఏగి = వెళ్ళి; అందున్ = అందులో; గహనదహనంబునన్ = కారుచిచ్చులో; మృతిన్ = మరణమును; పొందెన్ = పొందెను; ధ్రువుండు = ధ్రువుడు; భాత్రు = సోదరుని; మరణంబున్ = మరణమును; విని = విని; కోప = కోపము; అమర్ష = రోషము; శోక = దుఃఖములతో; వ్యాకులిత = చీకాకుపడిన; చిత్తుండు = మనసు కలవాడు; ఐ = అయ్యి; జైత్రంబు = జయించు లక్షణము కలది; అగు = అయిన; రథంబున్ = రథమును; ఎక్కి = ఎక్కి; ఉత్తర = ఉత్తరపు దిక్కు; అభిముఖుండు = వైపు వెళ్ళువాడు; ఐ = అయ్యి; చని = వెళ్ళి; హిమవద్ద్రోణి = హిమాలయ పర్వతపంక్తి; అందున్ = అందు; భూత = భూతముల; గణ = సమూహములచే; సేవితంబునున్ = సేవింపబడుతున్నది; ఐన = అయిన; గుహ్యక = గుహ్యకులచే; సంకులంబున్ = వ్యాపించినది; ఐన = అయిన; అలకాపురంబున్ = అలకాపురమును; పొడగని = కాంచి; ఆ = ఆ; మహాబాహుండు = మహాపరాక్రమశాలి {మహాబాహుడు – గొప్ప బాహువులు కలవాడు, మహాపరాక్రమశాలి}.

భావము:- ఆ విధంగా ప్రవేశించగా రాజర్షి అయిన ఉత్తానపాదుడు అద్భుతమైన కొడుకు ప్రభావానికి ఆశ్చర్యపడ్డాడు. ధ్రువునకు ప్రజలపై గల అనురాగాన్ని, ప్రజలకు ధ్రువునిపై గల అభిమానాన్ని పరికించి నవయౌవనవంతుడైన ధ్రువుణ్ణి రాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేసాడు. తనకు ముసలితనం వచ్చిందని తెలుసుకొని సుగతిని పొందడానికి నిశ్చయించుకొని విరక్తుడై తపోవనానికి వెళ్ళాడు. ఆ తరువాత ధ్రువుడు శింశుమార ప్రజాపతి కూతురయిన భ్రమిని వివాహమాడి ఆమెవల్ల కల్పుడు, వత్సరుడు అనె ఇద్దరు కొడుకులను పొందాడు. వాయు పుత్రిక అయిన ఇలను పెండ్లాడి ఆమెవల్ల ఉత్కలుడు అనే కొడుకును, సౌందర్యవతి అయిన కూతురును పొందాడు. ధ్రువుని

తమ్ముడైన ఉత్తముడు పెండ్లి కాకముందే వేటాడటానికి హిమవత్పర్వత ప్రాంతంలోని అడవికి వెళ్ళి అక్కడ ఒక యక్షుని చేతిలో మరణించాడు. ఉత్తముని తల్లియైన సురుచి పుత్రదుఃఖంతో అడవికి వెళ్ళి అక్కడ కారుచిచ్చు మంటలలో చిక్కి మరణించింది. ధ్రువుడు తమ్ముని మరణవార్త విని కోపంతోను, దుఃఖంతోను కలత చెందిన మనస్సు కలవాడై జయశీలమైన రథాన్ని ఎక్కి ఉత్తరదిక్కుగా వెళ్ళాడు. అక్కడ మంచుకొండ లోయలో భూతగణాలతోను, యక్షులతోను నిండిన అలకాపురాన్ని చూచి మహాపరాక్రమవంతు డైన ఆ ధ్రువుడు...

## స్తోత్రంబు

4-974-చ. ★

**సరసవచో విలాస! గుణసాగర! సాగర మేఖలా మహీ**
**భరణ ధురంధరప్రకట భవ్య భుజాభుజగేంద్ర! రాజశే**
**ఖర! ఖర దూషణప్రముఖ గాఢ తమఃపటలప్రచండభా**
**స్కర! కఱకంఠ కార్ముక విఖండన ఖేలన! భక్తపాలనా!**

టీక:- సరసవచోవిలాస = రామచంద్ర {సరస వచో విలాసుడు - సరస (మనోహర మైన) వచస్ (పలుకలతో) విలాసుడు (శోభిల్లువాడు), రామ}; గుణసాగర = రామచంద్ర {గుణ సాగరుడు - సుగుణములకు సాగరుడు (సముద్రము వంటివాడు), రాముడు}; సాగర మేఖలా మహీభరణ ధురంధర = రామచంద్ర {సాగర మేఖలా మహీ భరణ ధురంధురుడు - సాగర (సముద్రములే) మేఖలా (సరిహద్దులుగా గల) మహీ (భూమండల మును) భరణ (పాలించుటఅను) ధురంధరుడు (భారము వహించు వాడు), రాముడు}; ప్రకటభవ్య భుజా భుజగేంద్ర = రామచంద్ర {ప్రకట భవ్య భుజా భుజగేంద్రుడు - ప్రకట (ప్రసిద్ధమైన) భవ్య (శుభమైన) భుజ (భుజము లనెడి) భుజగేంద్రుడు (గొప్ప సర్పములు గలవాడు), రాముడు}; రాజశేఖర = రామచంద్ర {రాజ శేఖరుడు - రాజులలో (శ్రేష్ఠమైన వాడు), రాముడు}; ఖరదూషణప్రముఖగాఢతమఃపటలప్రచండభాస్కర = రామచంద్ర {ఖర దూషణ ప్రముఖ గాఢ తమఃపటల ప్రచండభాస్కర - ఖర (వాడియైన, ఖర అనెడి రాక్షసుడు) దూషణ (దూషించదగినది, దూషణుడు అనెడి రాక్షసుడు) ప్రముఖ (మొదలగు) గాఢ (గాఢమైన) తమః (చీకట్ల) పటల (తెరలకు) ప్రచండ (భయంకరమైన) భాస్కర (సూర్యుని వంటివాడు), రాముడు}; కఱకంఠ కార్ముక విఖండన ఖేలన = రామచంద్ర {కఱకంఠ కార్ముక విఖండన ఖేలనుడు - కఱకంఠ (శివుని) కార్ముక (ధనుస్సును) విఖండన (విఱుచుట అనెడి) ఖేలన (క్రీడ గలవాడు), రాముడు}; భక్తపాలనా = రామచంద్ర {భక్తపాలనుడు - భక్త (భక్తులను) పాలన (పరిపాలించెడివాడు), రాముడు}.

భావము:- రసవంతమైన వాగ్విలాసం కలవాడా! గుణసముద్రా! సముద్రం ఒడ్డాణంగా కల భూమి భారాన్ని మోయడంలో సమర్థమైన శేషుని వంటి భుజాలు

గలవాడా! రాజ చూడామణీ! ఖర దూషణులు అనే గాఢాంధకారానికి ప్రచండ భాస్కరుడా! శివుని ధనువును విరిచినవాడా! భక్తులను పాలించేవాడా!

## ఉపాఖ్యానాంత గద్యము

4-977-గ.

**ఇది శ్రీ పరమేశ్వరకరుణాకలిత కవితావిచిత్ర కేసనమంత్రిపుత్ర సహజ పాండిత్య పోతనామాత్యప్రణీతంబైన శ్రీమహాభాగవతంబను మహా పురాణ,చతుర్థ స్కంధ బందలి నుత్తానపాదుని వృత్తాంతంబును, ధ్రువోపాఖ్యానంబును, ధ్రువుండు దండ్రిచేత నవమానితుండై నారదోప దేశంబున మధు వనంబునకుం జని తపంబు చేయుటయును, హరిప్రసన్నుండై యతని మనోరథం బులిచ్చుటయును, నతండు మరలఁ బురంబునకు వచ్చుటయుఁననుకథలుగలధ్రువోపాఖ్యానము సుసంపూర్ణము.**

టీక:- ఇది = ఇది; శ్రీ = శ్రీ; పరమేశ్వర = పరమశివుని; కరుణా = కృపవలన; కలిత = జన్మించిన; కవితా = కవిత్వమురచించుటలో; విచిత్ర = విశేషమైన చిత్రములు కలిగిన; కేసనమంత్రి = కేసనమంత్రి యొక్క; పుత్ర = కుమారుడైన; సహజ = సహజసిద్ధమైన; పాండిత్య = పాండిత్యము కలిగిన; పోతనామాత్య = పోతన అనెడి శ్రేష్ఠునిచేత; ప్రణీతంబున్ = సంస్కరింపబడినది; ఐన = అయిన; శ్రీ = శ్రీ; మహాభాగవతంబు = మహాభాగవతము; అను = అనెడి; మహా = గొప్ప; పురాణ = పురాణము నందలి చతుర్థ స్కంధం బందలి ఉత్తానపాదునిన్ = ఉత్తానపాదుని యొక్క; వృత్తాంతంబునున్ = వృత్తాంతము; ధ్రువోపాఖ్యానంబును = ధ్రువోపాఖ్యానము; ధ్రువుండున్ = ధ్రువుడు; తండ్రి = తండ్రి; చేతన్ = చే; అవమానితుడు = అవమానింపబడినవాడు; ఐ = అయ్యి; నారద = నారదుని యొక్క; ఉపదేశంబునన్ = ఉపదేశము వలన; మధువనంబున్ = మధువనమున; కున్ = కి; చని = వెళ్ళి; తపంబున్ = తపస్సు; చేయుటయును = చేయుట; హరి = నారాయణుడు; ప్రసన్నుండు = ప్రసన్నమైనవాడు; ఐ = అయ్యి; అతని = అతని యొక్క; మనోరథంబున్ = కోరికలను; ఇచ్చుటయునున్ = తీర్చుట; అతండు = అతడు; మరలన్ = మళ్ళీ; పురంబున్ = పురమున; కున్ = కు; వచ్చుటయున్ = వచ్చుట అను = అనెడి; కథలు = కథలు; కల = కలిగిన; ధృవ = ధ్రువుని యొక్క; ఉపాఖ్యానము = వృత్తాంతము; సుసంపూర్ణము = శుభకరము పూర్తి యగుట.

భావము:- ఇది పరమేశ్వరుని దయ వలన కలిగిన కవితావైభవం కలవాడు, కేసన మంత్రి పుత్రుడు అయిన పోతనామాత్యునిచే రచింపబడిన శ్రీ మహాభాగవతం అనే మహాపురాణ చతుర్థ స్కంధము లోని స ఉత్తానపాదుని వృత్తాంతం, ధ్రువోపాఖ్యానం, ధ్రువుడు తండ్రిచేత అవమానింపబడి నారదుని ఉపదేశంతో మధువనానికి వెళ్ళి తపస్సు చేయడం, హరి ప్రసన్నుడై అతని కోరికలు తీర్చడం, అతడు తిరిగి నగరానికి వచ్చుట అనే కథలు ఉన్నట్టి ధ్రువోపాఖ్యానము ఇంతటితో సుసంపూర్ణము.

ఓం నమో భగవతే వాసుదేవాయ॥

ఓం! ఓం! ఓం!

ఓం! శాంతిః! శాంతిః! శాంతిః!

సర్వే జనా స్సుఖినో భవతు॥

---